# చందమామ

సంపుటి 102 ఏప్రిల్ 2000 సంచిక 4



## ఈ సంచికలో...

### కథలు



### జానపద సీరియల్



### పౌరాణిక సీరియల్



### చారిత్రక విశేషాలు



### శీర్షికలు



Printed and Published by B. Viswanatha Reddi at B.N.K Press Pvt. Ltd., Chennai–600 026 on behalf of Chandamama India Limited, Chandamama Buildings, Vadapalani, Chennai–600 026. Editor: Viswam

## ఈ నెల విశేషాలు



జ్ఞాని-మూఢుడు
(బేతాళ కథ)

శివుడి వివాహం





స్వర్ణ సింహాసనం

పాల్గొనండి బహుమతులు గెలుచుకోండి



చందమామ



# చందమామ

## మార్చ్ 2000




### సమాధానాలు

1. తిరువళ్ళువర్—వాసుకి.

2. ఎ. ధృతరాష్ట్రుడు గాంధారదేశ యువరాణి గాంధారిని వివాహమాడాడు.
   బి. సాల్వయువరాణి సావిత్రిని సత్యవంతుడు వివాహమాడాడు.
   సి. సహదేవుడి తల్లి మాద్రి, మద్రదేశపు యువ రాణి.
   డి. కర్ణుడు అంగదేశాధిపతిగా చేయబడ్డాడు.
   ఇ. అర్జునుడికి చిత్రాంగద ద్వారా కలిగిన సంతానం బభ్రువాహనుడు. చిత్రాంగద మణిపూరు రాజ్య యువరాణి. అదే ఈ నాటి మణిపురి అని చెబుతారు.

3. 1. అర్థశాస్త్రం. కౌటిల్యుడు.
   2. కాశ్మీరు రాజుల చరిత్ర అయిన 'రాజ తరంగిణి'. 12వ శతాబ్దానికి చెందిన కల్హణుడు.
   3. భాసుడు.
   4. భర్తృహరి. నీతి శతకం, శృంగార శతకం, వైరాగ్య శతకం.
   5. ఉత్తర కాండ.

---

గమనిక: 1. జనవరి నెల పోటీకి వచ్చిన ఎంట్రీలలో చాలావరకు సరైన సమాధానాలు గానీ, పూర్తిగా గానీ లేవు.
2. కొన్ని ఎంట్రీలలో సమాధానాలు సరిగ్గా ఉన్నప్పటికీ, కథల గురించిన అభిప్రాయాలు సంతృప్తికరంగా లేవు.
3. పోటీలో పాల్గొనే వారు నిబంధనలను జాగ్రత్తగా చదివి, వాటిని పాటిస్తూ, కథల గురించిన అభిప్రాయాలను విశ్లేషణాత్మకంగా రాయాలి.

# సృజనాత్మక పోటీలు

## చందమామ
### పాఠకులకు ఆహ్వానం

మీ ఊహాశక్తికీ, వివిధ రంగాలలో మీ సృజనాత్మక ప్రతిభకూ పదునుపెట్టే పోటీలలో పాల్గొనండి!



## ఫోటో
### వ్యాఖ్యల పోటీ

1. ఫోటో వ్యాఖ్యల పోటీ పేజీకి కావలసిన రెండు ఫోటోలను యువఫోటోగ్రాఫర్లు పంపవచ్చు. రెండు ఫోటోలకూ పరస్పర సంబంధం ఉండాలి. ఆ సంబంధం గురించిన సొంత వివరణ రాసి, తప్పకుండా ఆ ఫోటోలతో జతచేసి పంపాలి.

ఎంపికచేయబడే (రెండు) ఫోటోలకు
బహుమతి రూ.500/-
ఫోటోలు ఎప్పుడైనా పంపవచ్చు.



2. మీ పత్రికలో ఒక సామెతను ప్రచురిస్తాం. ఆ సామెతలోని విషయాన్ని వివరించే సంఘటనను గాని, సొంత అనుభవాన్నిగాని, లేదా (కొత్త/పాత) కథనుగాని 300 పదాలకు మించకుండా రాసి పంపాలి. మీరు పంపే రచనలో సామెతలకు సంబంధించిన విషయం ఉండాలే తప్ప, ఆ సామెత పుట్టిన కారణం తెలియజేసే అసలు కథను మాత్రం పంపకూడదు అన్న విషయం గుర్తుంచుకోండి.

**ఈ నెల సామెత: "చేతులు కాలాక ఆకులు పట్టుకున్నట్టే"**

**ఎంపికచేయబడే రచనకు బహుమతి రూ. 500/-**

మీ రచనలు ఏప్రిల్ 30లోగా మాకు చేరాలి.
గెలుపొందిన రచన జూలై నెల సంచికలో ప్రచురించబడుతుంది.
మీ ఎంట్రీలను ఈ చిరునామాకు పంపండి:
**చందమామ సృజనాత్మక పోటీలు**
చందమామ బిల్డింగ్స్, వడపళని, చెన్నయ్-600 026

—సంపాదకుడు

సంచాలకులు:
చక్రపాణి, బి. నాగిరెడ్డి

# మాతృభాష ప్రాముఖ్యత!

యేటా ఫిబ్రవరి 21వ తేదీని మాతృభాషా దినంగా జరుపుకోవాలని ఐక్యరాజ్యసమితి విద్యా విజ్ఞాన సాంస్కృతిక సంస్థ (యునెస్కో) ప్రకటించింది. 1952వ సం॥ ఈ రోజునే ఢక్కాలోనూ, పరిసర ప్రాంతాలలోనూ పలువురు స్త్రీ పురుషులు — ఉర్దూ భాషను తమపై బలవంతంగా రుద్దడాన్ని వ్యతిరేకిస్తూ నినాదాలు చేసి, మాతృభాష కోసం తమ ప్రాణాలర్పించారు. అప్పుడు ఢక్కా — పాకిస్తాన్‌లో అంతర్భాగంగా ఉన్న తూర్పు పాకిస్తాన్ రాజధానిగా ఉండేది. అప్పటి పాకిస్తాన్ ప్రధాని నజీరుద్దీన్, ఉర్దూను మాత్రమే అధికార భాషగా ప్రకటించాడు. స్థానిక ప్రజల మాతృభాష అయిన బెంగాలీకి అధికారభాషా ప్రతిపత్తి లేకపోయింది.

బాలల పరిపూర్ణ మానసిక వికాసానికీ, సక్రమమైన అభివృద్ధికీ సరైన మాతృభాషా పరిజ్ఞానం పునాదిలాంటిదని విద్యావేత్తలూ, మనస్తత్వ వేత్తలూ అభిప్రాయపడుతున్నారు. అందువల్ల మాతృభాషపట్ల ఉదాసీనత ప్రమాదకరమని ప్రతి ఒక్కరూ గ్రహించాలి. పిల్లలకు మాతృభాషలో చాలినంత పరిజ్ఞానాన్ని కలిగించడం తల్లిదండ్రులు తమబాధ్యతగా భావించాలి. వారికి అవసరమైన పాఠ్యాంశాలను మాతృభాషద్వారానే బోధించడం అవసరం!

ఇంకొక ముఖ్యవిషయం ఏమంటే — మాతృభాషల నిర్లక్ష్యం ఫలితంగా ప్రపంచ వ్యాప్తంగా మరో ఇరవై సంవత్సరాలలో దాదాపు 6,000 భాషలు నశించి పోగలవని యునెస్కో హెచ్చరిస్తున్నది. అలా జరిగినట్టయితే, ప్రపంచంలో వైవిధ్యం లోపిస్తుంది. మానవజాతి నష్టపోతుంది. ఇది జరగకూడదు.

# చందమామ కబుర్లు

## దారిచూపుతున్న కెనడా!

ఒక్క సిగరెట్ కాలిస్తే ఆయుర్దాయంలో పది కొండు నిమిషాలు కోల్పోతారని గత సంచికలో చెప్పుకున్నాం. పొగపీల్చడం వల్ల వాటిల్లే అపాయం గురించి ప్రజలకు హెచ్చరించడానికి కెనడా ప్రభుత్వం సరికొత్త ప్రయత్నంలో దిగింది. క్యాన్సర్ సోకిన ఊపిరితిత్తులు, రోగగ్రస్తమైన నోరు మొదలైన అవయవాల రంగుల బొమ్మలను సిగరెట్ ప్యాకెట్ల



మీద ముద్రించాలని సిగరెట్ తయారీ సంస్థలపై నిర్బంధం తీసుకు రానున్నది. మిగిలిన దేశాలు కూడా ఈ పద్ధతిని అనుసరించవచ్చు. అయినా, అలాంటి బొమ్మల బెదిరింపులు వచ్చేంతవరకు ఊరుకోకుండా – మనం పొగపీల్చే మిత్రులకు దాని అపాయం గురించి చెప్పి, వారిలో మార్పు తీసుకు రావడం మంచిది కదా?

## అధికారి ఆదర్శం!

మధ్యప్రదేశ్ రాజధాని భోపాల్ నగరంలోని జయప్రకాశ్ ఆస్పత్రిలో ఎప్పటిలాగే ఆరోజు కూడా తెల్లవారింది. ఉదయభానుడి లేత కిరణాలు డాక్టర్ల మీదా, రోగుల మీదా, భవనాల మీదా–ఆవరణ లోని చెత్తకుప్పల మీదా ప్రసరించ సాగాయి.

ఉన్నట్టుండి ఒక పురుషుడూ, ఒకస్త్రీ చెత్తకుప్ప లను తొలగించడం ప్రారంభించారు. వాళ్ళు మామూలు పారిశుధ్యకార్మికులు కారు. ఆయన ఒకసీనియర్ ఐఏఎస్ అధికారి. పాలనాయంత్రాంగ అధికారులకు శిక్షణనిచ్చే అకాడెమీ డైరెక్టర్ శ్రీ పద్మవీర్‌సింగ్. ఆమె ఆయనగారి సతీమణి.

ఆ దృశ్యాన్ని చూసి అమితాశ్చర్యం చెందిన, అకాడెమీలో శిక్షణ పొందుతున్న వారందరూ ఆ దంపతులను అనుసరించారు. ఆ తరవాత డాక్టర్లూ, మిగతా సిబ్బందీ వారితో కలిశారు. ఎంతో కాలంగా అక్కడ పేరుకుపోయిన చెత్తకుప్పలు కొన్ని గంటలలో మటుమాయమయ్యాయి.



ప్రతిపనికీ ఇతరులపై ఆధారపడకుండా మనం చేసుకో తగిన పనులను మనమే చేసుకున్నట్టయితే ఎంతోసాధించవచ్చు. కావలసినదల్లా దేశభక్తి, సాటి మనుషులపై ప్రేమ, మరికాస్త వినయం. ఈ సుగుణాలన్నీ శ్రీ సింగ్‌లో పుష్కలంగా ఉన్నాయి. అందుకే ఆయన అందరికీ ఆదర్శమయ్యాడు.

## బిగ్ బ్యాంగ్ క్షణాలకేసి.....



అమెరికాలోని ఒక 'నేషనల్ లేబొరేటరీ'లో మైక్రో మిర్రర్ ఒకటి రూపొందించబడింది. ఇందులో వున్న అత్యున్నతమైన సెన్సిటివ్ సిస్టమ్‌తో - సృష్ట్యాదిలో బిగ్‌బ్యాంగ్ ద్వారా సృష్టించబడిన మొట్టమొదటి గ్రహాల బింబాలను చూడవచ్చని నిపుణులు భావి స్తున్నారు!

# పాఠకుల అభిప్రాయసేకరణ

1999 డిసెంబర్‌లో చందమామను మళ్ళీ ప్రారంభించాక వెలువడిన ఐదవ సంచిక ఇప్పుడు మీ చేతులను అలంకరిస్తోంది. గత నాలుగు సంచికలను మీరు ఆసక్తితో చదివి ఆనందించారని మాకు తెలుసు. యాభై సంవత్సరాలకు పైగావున్న చందమామ ప్రత్యేక విశిష్ట అంశాలను కొనసాగిస్తూ, ప్రస్తుతం కథలలోనూ, శీర్షికలలోనూ, లే అవుట్‌లోనూ కొన్ని మార్పులు తీసుకువచ్చిన విషయం పాఠకులకు విదితమే. కాగితం నాణ్యత గురించి వేరుగా చెప్పనవసరం లేదు. ప్రతి సంచికనూ గతసంచికకన్నా మరింత ఆకర్షణీయంగా తీర్చి దిద్దడానికి ప్రయత్నించాము. మేము చేసిన మార్పులను గమనిస్తూ గత నాలుగు నెలలుగా పాఠకులు ఉత్తరాలు రాస్తూనే ఉన్నారు. అయినా మేము దాంతో తృప్తిచెందడం లేదు. పాఠకుల అభిరుచికీ, అభీష్టానికీ అనుగుణంగా పత్రికలో ఏ ఏ మార్పులు, చేర్పులు చేస్తే బావుంటుందో ఆలోచిస్తున్నాము. అందుకోసం మీ అభిప్రాయాలను ఆహ్వానిస్తున్నాము. మీ అభిప్రాయాలనూ, ఇష్టా ఇష్టాలనూ తెలియజేయడానికి మీలో ప్రతి ఒక్కరూ కింద కనబరచిన ప్రశ్నలకు సమాధానాలు రాసి, సూచించిన చోట కత్తిరించి, వీలయినంత త్వరలో మాకు పోస్టు చేయాలని కోరుతున్నాము. మీ అభిప్రాయాలను సూచించడం చాలాసులభం. చాలా చోట్ల నిర్దేశించిన గళ్ళలో (✓) గుర్తు పెడితే చాలు. ఇక కలం తీసుకోండి. ప్రశ్నలను చూద్దాం.

I. నాకు చందమామ కాపీలు ☐ చందా ద్వారా వస్తాయి.
నేను కాపీలను ☐ పత్రికలమ్మేకుర్రాడి నుంచి కొంటాను.
నేను కాపీలను ☐ మార్కెట్లో కొనుక్కుంటాను.
నేను పత్రికలను ☐ స్నేహితులు / లైబ్రరీ నుంచి అరువు తెచ్చుకుంటాను.

II. కింద కనబరచిన వాటిని కూడా నేను క్రమం తప్పకుండా / అప్పుడప్పుడూ చదువుతాను.

☐ కామిక్స్ ☐ కథల పుస్తకాలు ☐ ఇతర పిల్లల పత్రికలు........................................(పేర్లు రాయండి)

III. నేను తెలుగు / ఇంగ్లీష్ / తమిళం / కన్నడం / మలయాళం / హిందీ / మరాఠీ / గుజరాతీ / బెంగాలీ / అస్సామీ / ఒరియా / సంస్కృతం చందమామను చదువుతాను. (మీరు చదివే భాషను అండర్‌లైన్ చేయండి)

IV. గత నాలుగు నెలలలో నేను

☐ 4 సంచికలు ☐ 3 సంచికలు
☐ 2 సంచికలు ☐ 1 సంచిక చదివాను.



V. కథలను, శీర్షికలను కింద కనబరచిన క్రమంలో ఆసక్తిగా చదువుతాను.

☐ జానపద సీరియల్ ☐ పురాణ కథలు ☐ బేతాళ కథలు
☐ వివిధ దేశాల కథలు ☐ ఇతర కథలు
☐ భారత దేశ సంస్కృతి - చరిత్ర ☐ చందమామ కబుర్లు
☐ భారతదేశం: నాడు-నేడు ☐ భారత దర్శనం ☐ వార్తలు- విశేషాలు
☐ కావేరీ తీర ప్రయాణం

(మీఇష్ట ఇష్టాలను వరుస క్రమంలో 1 నుంచి 11 వరకు నంబర్లతో సూచించండి)

VI. చందమామలో ఈ శీర్షికలను కూడా చేర్చాలని ఆశిస్తున్నాను :
(ప్రాధాన్యతా క్రమంలో రాయండి)

i.................................... iv....................................
ii. .................................... v....................................
iii.................................... vi....................................

VII. చందమామ ముఖచిత్రం ఇలా వుంటే బాగుంటుంది:

☐ పౌరాణిక సీరియల్ దృశ్యం ☐ జానపద సీరియల్‌లోని దృశ్యం
☐ ఇతర కథలలోని ఒక దృశ్యం

VIII. పత్రిక ధర 10 రూపాయలు ☐ మరీ ఎక్కువ ☐ ఫరవాలేదు
☐ తగ్గిస్తే మంచిది (సరసమైన కాగితం ఉపయోగించి)

IX. i) నేను చందాదారును ii) చందాదారును కావాలనుకుంటున్నాను.

పేరు.................................................................... వయసు...............
తరగతి ...............పాఠశాల ....................................................
చిరునామా ....................................................................
....................................................................
............................... PIN...................... రాష్ట్రం...................

iii) నేను బడికి వెళ్ళేది ☐ సైకిలు మీద ☐ స్కూల్ బస్సులో ☐ సిటీ బస్సులో
☐ పెద్దల వాహనంలో

iv) నెలనెలా ☐ 100రూ॥ కన్నా తక్కువ ☐ 100రూ॥ కన్నా ఎక్కువ పాకెట్‌మనీ వస్తుంది.

తల్లి / తండ్రి సంతకం సంతకం

బేతాళ
కథలు

## జ్ఞాని-మూఢుడు

పట్టువదలని విక్రమార్కుడు చెట్టువద్దకు తిరిగివెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్నిదించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, నీ పట్టుదలా, ధైర్యసాహసాలూ వేనోళ్ళ ప్రస్తుతింప తగినవి. నువ్వు సాధించ దలచిన కార్యంలో, పదేపదే భంగపడుతున్నా, నీలో నిరాశానిస్పృహలు ఛాయామాత్రంగా కూడా కనిపించడంలేదు.తరచిచూస్తుంటే, నిన్నీకఠోరమైన కార్యానికి పురిగొల్పిన వాడికన్న, నువ్వుజ్ఞానివనిపిస్తున్నది! లోకం జ్ఞాన, మూఢమతుల సమ్మేళనం. ఒక్కొక్కసారి, తామున్న



స్థాయీ భేదాలకారణంగా మూఢుడు, జ్ఞానిని శాసించగలడు. ఒక దేశ పాలకుడివైన నిన్ను, ఇంత అర్ధరాత్రివేళ, భీతిగొలిపే ఈ శ్మశానంలో తిరుగాడే దుస్థితికి పాలుజేసిన వాడు జ్ఞానవంతుడా లేక మూఢుడా అన్న శంక కలుగుతున్నది. ఏది ఏమైనా, నీకు శ్రమ తెలియకుండా వుండేందుకు, విరాజితశర్మ అనే ఒక యువశిల్పికథ చెబుతాను, విను," అంటూ ఇలా చెప్పసాగాడు:

పూర్వం చక్రవాకపురాన్ని శశిధరుడనే రాజుపాలించేవాడు. ఆయన ఒక్కగానొక్క కుమార్తె శంపాలత. ఆమె అందచందాల్లో దేవకన్యలకు సాటివచ్చేది. ఆనాటి రాచ స్త్రీలు పరపురుషుల కంటపడకూడదనే ఆచారంవల్ల, యువరాణి ఎంత గొప్ప సౌందర్యవతో, ఆదేశపౌరులకు తెలియదు.

ఒకనాడు శంపాలత, తండ్రితో తన రూపశిల్పం చెక్కించుకోవాలని కోరికగా వున్నదని చెప్పింది. రాజు శశిధరుడు సరేనని, ఎంతో ప్రయత్నం మీద దేశంలో వున్న కొద్దిస్త్రీశిల్పులను రప్పించి, వారిచేత తన కుమార్తె శిల్పం చెక్కించే ప్రయత్నం చేశాడు. అయితే, వారు చెక్కిన శిల్పాలు యువరాణి లావణ్యాన్ని ప్రతిబింబించలేక పోవడంతో,ఆమె నిరాశకు గురయింది.

ఈ అనుభవంతో, రాజుకు ఒక విచిత్ర మైన ఆలోచన వచ్చింది. తన కుమార్తె శిల్పాన్ని అద్భుతంగా చెక్కిన శిల్పిని, తన ఆస్థానప్రధానశిల్పిగా నియమిస్తానని దేశ మంతటా చాటింపు వేయించాడు. ఆ సమయంలో, దేశ సరిహద్దులకావలనున్న వజ్రకూటంలోని శిల్పకళాశాలలో, శిల్ప విద్యనభ్యసిస్తున్న విరాజితశర్మ చక్రవాక పురంలోవున్న తన తల్లిదండ్రులనుచూసేం దుకు వస్తూ, ఈ చాటింపు విని చాలా ఆశ్చర్యపోయాడు.

విరాజితశర్మ తండ్రి, ప్రకంపనశర్మ రాజాస్థానశిల్పులలో ఒకడుగా చాలా కాలం పనిచేసి, వార్ధక్య కారణంగా, పదవీ విరమణ చేసినవాడు. విరాజితశర్మ ఇల్లు చేరుతూనే, తానువిన్న రాజుగారి చాటింపు సంగతి చెప్పి, "నాన్నా, మనిషినిచూడ కుండా, ఆ రూపురేఖలు వచ్చేలా శిల్పం చెక్కడం ఎలా?" అనిఅడిగాడు.

ఈ ప్రశ్నవింటూనే వృద్ధ శిల్పి పెద్దగా నవ్వి, "యువరాణిని చూడకుండా, ఆమె శిల్పం చెక్కడం ఎలా సాధ్యమన్న ప్రశ్న,

ప్రతిశిల్పినీ కలవరపరిచేదే, కాదనను. ఐతే, అసాధ్యాలు సాధ్యమయ్యేందుకు కొన్ని మార్గాలున్నవి. ఇందుకు మంత్రమో, తంత్రమో నేర్వాలి. మన రాజ్యానికి ఆగ్నే యదిశలో, యక్షిణిజాతివాళ్ళు ప్రతి అమా వాస్యనాడూ సందర్శించి పోయే, ఒక అద్భుతమైన అరణ్యప్రాంతం వున్నది. ఈ యక్షులు దేవగణాల్లో అందరినీ మించిన మంత్రతంత్రకోవిదులు. వాళ్ళసహాయం పొందితే, లోకంలో సాధ్యం కానిదంటూ ఏమీ వుండదు. ఎల్లుండి అమావాస్య గదా!" అన్నాడు.

"మరి, వాళ్ళ సహాయం పొందడం ఎలా? యువరాణి శంపాలత రూపశిల్పం చెక్కి, నేనే రాజాస్థాన ప్రధాన శిల్పిని కావాలని వున్నది!" అన్నాడు విరాజితశర్మ.

"ఐతే, సాహసించు! నేను ఆస్థాన ప్రధాన శిల్పిని కాలేకపోయినా, నువ్వు ఆ స్థానం సంపాయించగలిగితే, అంతకన్న నాకు ఆనంద కారణం ఏమున్నది? ఎంతో మంది మనుషులు, ఆ యక్షిణులను ఆశ్రయించి తమ కోరికలను సఫలం చేసుకున్నారని, నా చిన్నప్పటినుంచీ వింటున్నాను," అన్నాడు ప్రకంపనశర్మ.

తండ్రిమాటలను ఆశీస్సుగా, అనుమతిగా భావించిన విరాజితశర్మ, ఆ మర్నాటి ఉదయమే, ఒక మేలుజాతి అశ్వాన్ని అధిరోహించి, ఒక పగలూ, ఒక రాత్రీ ఆగకుండా ప్రయాణం చేసి, అరణ్యంలో యక్షులుండే వనప్రాంతాన్ని సూర్యాస్తమయము వుతూండగా చేరాడు.



శర్మకు అక్కడ ఒక పెద్దకొలను కనిపించింది. అతడు వెంట తెచ్చుకున్న రొట్టెలలో మిగిలిన వాటిని, ఆ కొలను ఒడ్డున కూర్చుని భుజించి, తియ్యటి కొలను నీటిని తాగి, దాపులనున్న దిరిసెన చెట్లలో ఒక చెట్టు బోదెకు ఆనుకుని, బడలిక వల్ల మరుక్షణం గాఢనిద్రలోకి జారుకున్నాడు.

ఒక గంటకాలం గడిచేసరికి, విరాజిత శర్మకు ఎవరో కిలకిలా నవ్వడం వినిపించి, చప్పున కళ్ళుతెరిచాడు. ఎదురుగా అతడికి ఇద్దరు యువతులు కనిపించారు. వాళ్ళ వస్త్రధారణా, ధరించిన నగలతీరూ, అపురూపమైన వాళ్ళ అందచందాలూ చూసి, శర్మ తప్పక యక్షిణులై వుంటారనుకున్నాడు.

ఆ యువతులు, విరాజితశర్మకేసి వింత పడుతూన్నట్టు ఒకటి, రెండు క్షణాలు



ఇది విని యక్షిణులిద్దరూ ఏవో సంజ్ఞలు చేసుకున్నారు. తర్వాత వారిలో ఒకతె, "మనిషిని చూడకుండా, వాళ్ళ రూపాన్ని శిల్పంగా చెక్కడం మహాద్భుతమైన విద్య. సరే! నాపేరు చపల, ఈ నా సఖి పేరు చంచల. మాకూ, మా శిల్పాలు చెక్కించు కుని, ఈ దిరిసెన వనానికి అలంకారప్రా యంగా వుంచాలనివున్నది. శంపాలత శిల్పంచెక్కడం పూర్తయ్యాక, మా శిల్పాలు కూడా చెక్కాలి. సరేనా?" అన్నది. "అలాగే మీ శిల్పాలూ చెక్కుతానని వాగ్దానం చేస్తు న్నాను. ఇంతకూ, ముందుగా యువరాణి శంపాలత రూపం ఎలావుంటుందో, నాకు తెలియాలి గదా?" అన్నాడు శర్మ.

ఆ వెంటనే చపల చిటిక వేసి, ఏదో మంత్రం చదివి, "ఇదిగో, మీ రాజకుమారి శంపాలత!" అంటూ చంచలను తాకింది.

మౌనంగా చూసి, "మా నవ్వులు నీకు నిద్రాభంగం కలిగించినట్టున్నది, ఏమను కోకు. ఇంకామూడుజాముల రాత్రివున్నది. ఇంతకూ నువ్విక్కడికెందుకు వచ్చినట్టు? నువ్వు గొప్ప సాహసిలావున్నావు," అన్నారు.

ఆ మాటలతో విరాజితశర్మకు, అంతకు ముందున్న కొద్దిపాటి భయంకూడా పోవ డంతో, "యక్షిణులకు నమస్కారం! నేను సాహసినవునో కాదో గాని, శిల్పిని!" అని, తాను నేర్చిన శిల్పవిద్య గురించీ, రాజు తన కుమార్తె శంపాలతను చూడకుండా శిల్పం చెక్కినవాళ్ళకు, ఇస్తానన్న పదవిని గురించీ చెప్పి, "ఇందుకు, మీ సహాయం అర్థించగోరి, ఈ మహారణ్యంలోకి వచ్చాను," అంటూ మరొకసారి యక్షిణులకు నమ స్కరించాడు.

ఆమరుక్షణం చంచల అసమానమైన మానవ కన్యారూపంలో, శర్మకు కనిపిం చింది. అతడు, ఆమెకేసి కొద్దిసేపు ఆశ్చర్య పోతూచూసి, "అవును, ఈ సుందరి తప్పక రాకుమారి శంపాలతే అయివుంటుంది. మరి చంచల ఏమయినట్టు!" అంటూ చపలకేసి చూశాడు.

"నేను రాకుమారి రూపంలోవున్న చంచ లను. నా కంఠస్వరం తెలియడం లేదా?" అన్నది, శంపాలత రూపంలోవున్న చంచల.

"ఆహాఁ, మహాద్భుతం! యక్షిణిలకు లోకంలో సాధ్యంకానిదంటూ ఏమీ లేదు. మరి, నాకు రాకుమారిశిల్పం చెక్కేందుకు చక్కని పాలరాయి కావాలి. అంతకన్న

ముఖ్యం, ఆమె మీద వెలుగు ప్రసరించాలి. అప్పుడు, ఆమె రూపాన్ని నేను ఉన్నదున్నట్టుగా పాలరాతి మీద చెక్కగలను," అన్నాడు విరాజితశర్మ.

ఆ మరుక్షణం, చపల చిటికె వేసి, ఏదో మంత్రం జపించగానే, చెట్టుబోదెకు నిలువుగా ఆనించివున్న పాలరాయితో పాటు, రాకుమారిపై వెన్నెల లాంటి వెలుగుప్రసరించింది. విరాజితశర్మ తను వెంట తెచ్చుకున్న సంచీలోంచి సుత్తీ, ఉలీ బయటికి తీసి పాలరాయి ముందుకు వెళ్ళాడు. అప్పుడు చంచల, "శర్మా, శిల్పం చెక్కడం త్వరగా పూర్తయేందుకు, నీ పనిముట్లకు నూరంతల వేగం, ఒడుపూ ఇస్తున్నాను. ఇక పని ప్రారంభించు," అన్నది.

విరాజితశర్మ శిల్పంచెక్కడం ప్రారంభించాడు. అతడు మధ్య మధ్య రాకుమారి కేసి చూస్తూ, ఒక్క గంటకాలంలో శిల్పం చెక్కడం ముగించి, పరమానందంగా, యక్షిణులతో, "మీ సహాయానికి చాలా కృతజ్ఞుణ్ణి. ఇప్పుడిక రాకుమారిశిల్పాన్ని, రాజధానీ నగరంలోని మా ఇంటికి చేర్చారంటే, వచ్చే అమావాస్యనాడు మళ్ళీ వచ్చి, మీ ఇద్దరి శిల్పాలు చెక్కుతాను," అన్నాడు.

"నిన్నూ, రాకుమారి శిల్పాన్నీ, నీ అశ్వాన్నీ మీ ఇంటికి చేర్చడం, అదెంతపని! కళ్ళు మూసుకో!" అన్నారు చపల, తన యథారూపం ధరించిన చంచల.

విరాజితశర్మ కళ్ళుమూసుకున్నాడు. కొద్ది సేపటి తర్వాత అతడు, తండ్రిగొంతు విని కళ్ళు తెరిచే సరికి, తన ఇంటి ఆవరణలో శిల్పం పక్కన వున్నాడు. ఆ సరికి సూర్యోదయం అవుతున్నది. తనకేసీ, విగ్రహంకేసీ ఆశ్చర్యపోతూచూస్తున్న తండ్రితో, శర్మ అరణ్యంలో జరిగిందేమిటో చెప్పాడు.



ఆ సాయంత్రం, నలుగురు రాజభటుల సాయంతో విగ్రహాన్ని కోటలోని శిల్పారామానికి చేర్పించి, రాజుకు తాను రాకుమారి విగ్రహం చెక్కిన విషయం తెలియజేశాడు, విరాజితశర్మ. రాజు, కుటుంబంతో సహా శిల్పారామానికి వచ్చి, విగ్రహంలో అచ్చుగుద్దినట్టున్న తన కుమార్తె రూపాన్ని చూసి అబ్బురపాటు చెందాడు.

శంపాలత ఎక్కడలేని సంతోషంతో, "ఆహాఁ, అద్భుతం! ఈ శర్మ ఎవరో దేవశిల్పిలా వున్నాడు. నన్ను నేను అద్దంలో చూసు కుంటున్నట్టున్నది, అందమైన ఈ



పాలరాతి శిల్పాన్ని చూస్తూంటే!" అన్నది. రాజు శశిధరుడు, అన్న ప్రకారం విరాజిత శర్మను, వారంరోజుల్లో రానున్న ఒక శుభ ముహూర్తాన, ఆస్థాన ప్రధానశిల్పిగా నియమించనున్నట్టు నగరంలో చాటింపు వేయించాడు.

ఆ తర్వాత, రెండు రోజులకు రాజు నుంచి, విరాజితశర్మకు పిలుపు వచ్చింది. అతడు రాగానే, రాజు, నిన్నుమించిన శిల్పి లోకంలో మరొకరు లేరంటూ మెచ్చుకుని, "శర్మా, మా వదినెగారి కుమార్తె మంజుల, ఈ ఉదయమే శమంతక నగరం నుంచి, నువ్వు చెక్కిన శిల్పం చూసేందుకు వచ్చింది. ఆమే, యువరాణి శంపాలత ఈడుదే. తనూ తనరూపశిల్పాన్ని చెక్కించుకోవాలన్న కోర్కెబయట పెట్టింది. నిన్ను, దేవశిల్పివిశ్వకర్మకు దీటైన వాడివని పొగిడింది. ఆమె శిల్పాన్ని కూడా ఒక వారం, పది రోజుల్లో పూర్తి చెయ్యి. నిన్ను ఆస్థాన ప్రధాన శిల్పిగా నియమించే సమయంలో జరుగనున్న ఉత్సవాలను రెండు వారాల తర్వాత జరిపిస్తాను," అన్నాడు.

ఆ మాటలు వింటూనే విరాజితశర్మ నివ్వెరపోయి, కొద్దిసేపు తలవంచుకుని, తర్వాత తలఎత్తి రాజుముఖంలోకి సూటిగా చూస్తూ, "అలాగే, మహారాజా! శెలవు," అంటూ ఇంటికి తిరిగి వచ్చి, తండ్రికి జరిగింది చెప్పి, "నాన్నా! రేపు ఉదయమే బయలుదేరి, మనం వజ్రకూటంలోని, మా గురువుగారి శిల్పకళాశాలకు వెళ్ళిపోతున్నాం. ఆ కళాశాల మరొక రాజ్యంలో వున్నదని నీకు తెలుసు. ఆ రాజు, ఈ శశిధర రాజుకన్న బలవంతుడూ, బుద్ధిశాలీ. అయితే, నేను యక్షిణిలకు, వాళ్ళశిల్పం చెక్కుతానని వాగ్దానం చేశాను. ఆ పని, వాళ్ళు తిరిగి అమావాస్యనాడు, యక్షవనానికి వచ్చినప్పుడు, వజ్రకూటం నుంచి మారువేషంలో వెళ్ళి పూర్తిచేస్తాను," అన్నాడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, "రాజా, విరాజితశర్మ ప్రవర్తన ఎంత అవివేకమో, అసంబద్ధమో తెలుస్తున్నదిగదా! అతడు రాజ్యంలోని ఏ శిల్పీ సాధించలేని, ఒక మహాద్భుతకార్యాన్ని సాధించాడు. రాజు శశిధరుడు, అతణ్ణి ఆస్థాన ప్రధాన శిల్పిగా నియమించబోతున్నట్టు బహిరంగంగా ప్రకటించాడు. చపల, చంచల వంటి మంత్ర, తంత్ర విశారదులైన యక్షిణుల

సాయం వున్నది. వాళ్ళ రూపశిల్పాలు, రానున్న అమావాస్యనాడు చెక్కనున్నట్టు వాగ్దానం కూడా చేశాడు. రాజు కోరినట్టు, శంపాలత పెత్తల్లికుమార్తె మంజుల విగ్రహాన్ని యక్షిణుల సాయంతో, క్షణాల మీద పూర్తి చేయగల అవకాశం వున్నది. ప్రతిష్ఠాత్మకమైన ప్రధానశిల్పి పదవి, వస్తువాహనాలతో, ధనకనకాలతో రాజు చేయనున్న గొప్పసన్మానం — ఇన్నీ కాదని, వృద్ధుడైన తండ్రితో పరాయిదేశానికి పారిపోవాలన్న నిర్ణయానికొచ్చిన విరాజితశర్మ జ్ఞానా, మూఢుడా? ఈ సందేహాలకు సమాధానం తెలిసి కూడా చెప్పక పోయావో, నీతలపగిలి పోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "లోకంలో ఎన్నో దురాచారాలు, సదాచారాలుగా కొనసాగుతున్నవి. తమ ఇంటి స్త్రీలు పరపురుషుడి కంటబడగూడదనేది, రాజు శశిధరుడి వంశాచారంగా కనబడుతున్నది; దానిని తప్పుబట్టలేం. కాని, తన కుమార్తెను చూడకుండా, ఆమె శిల్పాన్ని చెక్కించాలనుకోవడం, మూఢత్వం. యువరాణి శంపాల తనుచూడకుండా, ఆమె శిల్పాన్ని విరాజిత శర్మ ఎలా చెక్కగలిగాడన్న అనుమానం, అతడికి గాని, కుమార్తెకు గాని, మధ్య వచ్చిన మంజులకు గాని కలగకపోవడం పరమమూఢత్వమనిపించుకుంటుంది. ఇక, విరాజితశర్మ విషయానికొస్తే, అతడు తండ్రిచెప్పేవరకూ, ఇలాంటి అమానుష కార్యం, ఏ యక్షిణుల కరుణాకటాక్షంవల్లనో సాధ్యపడుతుందని భావించలేదు. ఆ పని సాధ్యపడిన తర్వాత, రాజు మరొకరిశిల్పం చెక్కమనడం, విరాజితశర్మకు ఏవగింపు తెప్పించింది. తను ఆస్థాన ప్రధానశిల్పి అయ్యాక, రాజు ఇలాంటి గొంతెమ్మ కోరికలు ఎన్నయినా కోరవచ్చు. ప్రతిసారీ అతడు అరణ్యంలోని యక్షవనానికిపోయి, యక్షిణులసాయం కోరడం సాధ్యపడదు. రాజు ఎంతమూఢుడో తెలిశాక శర్మ ఆ మూఢపాలకుడిరాజ్యంవదలడంక్షేమంఅనుకున్నాడు. ఈ కారణాలవల్ల విరాజితశర్మ మూఢుడు కాడు, జ్ఞానే అనుకోవాలి!" అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. —(కల్పితం)

[ఆధారం:రాఘవరాజు పట్టాభిరామరాజు రచన]



## ఈ నెలలో జన్మించిన ప్రముఖులు

# ముగ్గురు సుప్రసిద్ధ గురువులు

శిక్షుల పదిమంది మహాగురువులలో ముగ్గురు ఏప్రిల్ నెలలో జన్మించారు. 1504 ఏప్రిల్ 23వ తేదీ గురుఅంగద్; 1563 ఏప్రిల్ 14వ తేదీ గురుఅర్జున్‌దేవ్; 1621 ఏప్రిల్ 12వ తేదీ గురుతేఘ్‌బహదూర్ (ఫోటోలోని వ్యక్తి) జన్మించారు.

గురునానక్ (1469-1538) శిక్షుమతాన్ని స్థాపించాడని మనకందరికీ తెలుసు. ఆయన భౌతికదేహాన్ని త్యజించవలసిన సమయం ఆసన్నమయినప్పుడు– తన అనుచరులను నడిపించడానికి తన శిష్యులలో ఒకరిని నాయకుడిగా నియమించవలసి వచ్చింది. ఆయన శిష్యులలో ఇద్దరు ఆయన కుమారులే వున్నారు. ఆయన ఆశాపాశాలకూ, బంధుప్రీతికీ అతీతమైన మహనీయుడు. అందువల్ల అందరికన్నా వివేకీ, సమర్థుడూ అని ఆయన భావించిన అంగద్‌ను తన వారసుడిగా నియమించాడు.



గురు అంగద్ తన గురువు అభీష్టానికి అనుగుణంగా, మంచి గురువుగానూ, దక్షుడైన నాయకుడిగానూ పేరు తెచ్చుకున్నాడు.

ఐదవ గురువైన గురు అర్జున్‌దేవ్ నాలుగవ గురువు రామదాస్ కుమారుడు. ఆయన తన పూర్వ గురువులు రచించిన గీతాలను సేకరించి 'ఆది గ్రంథ్' అనే శిక్షుల మత గ్రంథాన్ని రూపొందించాడు. హిందూమతానికి చెందిన పెద్దలు చెప్పిన సూక్తులు కూడా కొన్ని ఆదిగ్రంథ్‌లో చోటుచేసుకున్నాయి.

తండ్రి జహంగీరు మీద తిరుగుబాటు జరిపిన యువరాజు ఖుస్రూకు గురు అర్జున్ దేవ్ సహాయం చేశాడు. ఆయన యువరాజు రాజకీయ విజయాన్ని ప్రోత్సహించడానికి అతనితో సహకరించలేదు. ఆపదలో వున్న యువరాజు కష్టాలను చూసి దయతో అతనికి సహాయం అందించాడు. అయితే గురువు చర్యకు ఆగ్రహించెందిన జహంగీరు ఆయన్ను హతమార్చాడు.

తొమ్మిదవ గురువయిన గురుతేఘ్ బహదూర్ – కాశ్మీరు బ్రాహ్మణుల పట్ల ఔరంగ జేబు చూపిన క్రౌర్యాన్ని విమర్శించి, చక్రవర్తి ఆగ్రహానికి గురయ్యాడు. ఔరంగజేబు ఆయన్ను చర్చలకు పిలిచాడు. గురువు అందుకు అంగీకరించాడు. కాని, ఔరంగజేబు సహనాన్ని కోల్పోయి గురువును జైల్లో బంధించి క్రూరంగా హతమార్చాడు.

ఈ చర్య శిక్షుల చరిత్రను కొత్తమలుపు తిప్పింది. గురు తేఘ్ బహదూర్ కుమారుడు ధైర్యశాలి అయిన గురుగోవిందసింగ్-మొగల్ పాలకుల దురాగతాలను ఎదిరించి నిర్విరామ యుద్ధం సాగించాలని తన అనుచరులను తట్టిలేపి శిక్షుమతానికి నూతన స్ఫూర్తినిచ్చాడు!



# నిప్పుకోసం

శీతాకాలం రాత్రి కావడంతో గ్రామం పెందలాడే మాటుమణిగింది. గ్రామకాపలాదారు, "పహరా హుషార్!" అని కేక పెడుతూ అప్పటికే రెండుసార్లు గ్రామాన్ని చుట్టివచ్చాడు. రెండు మూడు రోజులుగా జమీందారు, గ్రామకచేరీలో బసచేసి ఉన్నాడు. అందువల్ల కాపలాదారు నిద్ర వదిలిపెట్టి కాపలాకాయడంలో అతిజాగ్రత్తను కనబరుస్తున్నాడు. బాగా చలివేయడంతో అతనికి చుట్ట కాల్చాలనిపించింది. జేబులు చూసుకుంటే చుట్టవుందిగాని అగ్గిపెట్టె కనిపించలేదు. ఎదురుగా వున్న గుడిసె ముందుకెళ్ళి కేక పెట్టాడు. వెదుళ్ళ తలుపును తెరుచుకుని ఒక ముసలావిడ బయటికి వచ్చి, "ఏంకావాలి, నాయనా?" అని అడిగింది.

"అవ్వా! మీ ఇంటి పొయ్యిలో నిప్పు వుంటే ఒక కణిక తీసుకురా, చుట్టకాల్చుకోవాలి," అన్నాడు కాపలాదారు.

"కొన్ని రోజులుగా పొయ్యి రాజెయ్యలేదు నాయనా! మధ్యాన్నం జమీందారీ కచేరీలో తిండిపెడుతున్నారు. రాత్రుల్లో గుడిపూజారి ఇచ్చే ప్రసాదం తిని సరిపెట్టుకుంటున్నాను. అందువల్ల వంటచేసే అవసరం ఏర్పడలేదు. మరి ఇప్పుడు నీకు నిప్పు ఎక్కణ్ణించి తేగలను చెప్పు," అంటూ తలుపు మూసుకుని లోపలికి వెళ్ళిపోయింది ముసలిది.

కాపలాదారు పక్కింటి వాకిట్లో నిలబడి కేక వేసి పిలిచి బయటకొచ్చిన పెద్దమనిషిని, "బాబూ! నీ దగ్గర అగ్గిపెట్టెవుందా? లేకుంటే పొయ్యిలో నిప్పయినా వుంటే చూడు. చలి చంపేస్తోంది. చుట్టకాల్చుకోవాలి," అని అన్నాడు.

'రెండూ లేవు నాయనా! పక్కింటి నుంచి నిప్పు తెచ్చుకుని పొయ్యి ముట్టించు

కున్నాం. వంటకాగానే నా భార్య నీళ్ళు చల్లిపొయ్యి ఆర్పేసింది. పక్కింట్లో వుందేమో ప్రయత్నించి చూడు," అంటూ ఆవులిస్తూ ఆయన లోపలికి వెళ్ళిపోయాడు.

మూడో ఇంటి ముందు నిలబడి కాపలావాడు ఎంత గీపెట్టినా ఒక్కరూ లేచి రాలేదు. గాఢనిద్రలో ఉన్నట్టుంది. అతడు కొంతసేపు అటూ ఇటూ తిరిగి, గ్రామకచేరీలో బసచేసి వున్న జమీందారు గారి సేవకులు ఒకరు కాకపోయినా ఒకరు మేలుకుని వుంటారు. అక్కడికి వెళితే తప్పకుండా అగ్గి పెట్టెదొరుకుతుంది అనుకుంటూ కచేరీ దగ్గరికి వెళ్ళి, "పహరా హుషార్!" అని హెచ్చరించాడు.

వాలుకుర్చీలో కూర్చుని గుమాస్తాతో ఏదో మాట్లాడుతున్న దివాను ఆ కేక విని, "శభాష్! ఇంత రాత్రయ్యాక కూడా ఇలా గస్తీ తిరుగుతున్నావే!" అన్నాడు కాపలా దారుతో.

"ప్రభువులు మన్నించాలి. చేతనైన రీతిలో బాధ్యతలను నిర్వర్తిస్తూన్న తమ సేవకుణ్ణి!" అంటూ చేతనున్న లాఠీనీ, లాంతరునూ నేలపై పెట్టి దివానుకు చేయెత్తి నమస్కరించాడు.

"బావుంది! అదిసరే ఇప్పుడిలా వచ్చావేమిటి? కాస్సేపు నడుం వాలుస్తావా?" అని అడిగాడు దివాను.

కాపలాదారు నాలుక వెళ్ళబెట్టి, "అయ్యో! ఎంతమాట! ఎంతమాట! రాత్రి పూట నడుం వాల్చడమా? ప్రభూ! కంటి మీద రెప్పవేయకుండా తెల్లవార్లూ గస్తీ తిరుగుతూ ఈ గ్రామాన్ని కాపాడ్డం నా బాధ్యత కదా!" అని కాస్సేపు ఆగి, "చలిగా వుంది. చుట్టకాల్చుకోవడానికి నిప్పు కావలసి వచ్చి ఇలా వచ్చాను, అంతే!" అన్నాడు.

"చుట్టకు నిప్పు కావాలా? భలేవాడివే, చేతిలో లాంతరు వుందికదా! దాంతో ముట్టించుకోకూడదా? అందులో వెలిగేది నిజమైన దీపం కాదా?" అని అడిగాడు దివాను నవ్వుతూ.

కాపలాభటుడు మళ్ళీ ఒకసారి నాలుక వెళ్ళబెట్టి, "అయ్యో, నా మతి మండా! నేను చేత్తో నిప్పుమోసుకు తిరగడం నాకు గుర్తే లేకపోయింది!" అంటూ నెత్తి కొట్టుకుని, లాంతరు అందుకుని ముందుకు సాగాడు.

వాడి స్థితి చూసి దివాను గమాస్తాలు పకపకా నవ్వారు.





# స్వర్ణసింహాసనం

(5)

[ కౌండిన్య దేశపు యువరాజు విజయదత్తుడికీ, మాధవసేనుడి కుమార్తె శ్రీలేఖకూ వివాహం జరిగింది. రాజగురువు సలహా ప్రకారం నగరానికి తూర్పు దిశలో వున్న మైదానంలో తవ్వకాలు ఆరంభమయ్యాయి. మహాసర్పం అడిగిన ప్రశ్నలకు విజయదత్తుడు సరైన సమాధానం చెప్పడంతో, అది పూలదండగా మారి విజయదత్తుడి మెడను అలంకరించింది. గోతిలో నుంచి అపూర్వ సింహాసనం బయటపడింది. యువరాజు పట్టాభిషేక ముహూర్త నిర్ణయం జరిగింది. విజయదత్తుడు స్వర్ణసింహాసనపు తొలిమెట్టు మీద కుడిపాదం మోపగానే "ఆగు!" అన్న కంఠస్వరం వినిపించింది. — *తరవాత*]

ఊహించని విధంగా ఎదురైన, ఆ వారింపుకు గాలిలోకి లేచిన విజయదత్తుడి పాదం, అప్రయత్నంగా వెనక్కు మళ్ళింది. వేదగానం చేస్తున్నవారూ, మంగళవాద్యాలమీద హంసధ్వనిరాగాన్ని పలికించబోతూన్నవాద్యకారులూ కూడా, తమతమ పనుల్ని ఆపివేశారు. ఒక్క క్షణకాలం, సభాభవనమంతా, సూదిపడితే వినిపించేంత నిశ్శబ్దం అలముకున్నది.

ఆ హఠాత్సంఘటనకలిగించిన దిగ్భ్రమ నుంచి మొదటగా తేరుకున్న విజయదత్తుడు, గంభీరస్వరంతో, "ఎవరు? వేద మంత్రాల మధ్య జరగబోతున్న, ఈ శుభ కార్యాన్ని ఆపజూస్తున్నదెవరు?" అంటూ ప్రశ్నించాడు.

అక్కడ చేరిన యావన్మందీ, ఆ ప్రశ్నకు జవాబు కోసం చెవులు రిక్కించివుండగా, ఆ కోమలస్వరం జవాబిస్తూ, "విజయదత్తా! నేను, నీ ఎదురుగా వున్న ఈ అపూర్వమైన స్వర్ణసింహాసనపు తొలిమెట్టు మీద, కుడివైపున వున్న సాలభంజికను. నేనే నిన్ను ఆగమన్నది," అన్నది.

ఆ జవాబువింటూనే, విజయదత్తుడితో సహా అక్కడి వారందరూ రెట్టింపు దిగ్భ్

లక్ష్మీగాయత్రి



సాలభంజిక వెంటనే మృదుస్వరంతో, "నాయనా, విజయదత్తా! నీ వినయ గాంభీర్యం చూస్తూంటే, నాకు చాలా సంతోషంగా వున్నది. ఈ సింహాసనపు సృష్టికర్త, దీన్ని సృష్టించటంలో గల ఆశయం, నీ ద్వారా నెరవేరుతుందన్న ఆశ నాకు కలుగుతున్నది. ఇక నీ ప్రశ్నలకు జవాబు వివరంగా చెబుతాను, విను!" అంటూ ఇలా చెప్పసాగింది:

"వందలసంవత్సరాలుగా భూగర్భంలో నిక్షిప్తమైవున్న, ఈ అపురూపసింహాసనం మీవంశానికి చెందినదే! చాలాకాలం క్రితం, మీవంశీకుల్లో ఎంతో గొప్పవాడుగా ఖ్యాతిగాంచిన, పౌరస్వతమహారాజు, దక్షిణ భారత దేశాన్నంతటినీ, ఒకతాటికిందకు తెచ్చి, ఏలినసంగతినీకు తెలిసేవుంటుంది! ఆ మహారాజు నిస్సంతుకావటంతో, అతడి తమ్ముడి కుమారుడైన హయగ్రీవుడు, పౌరస్వతుడి తదనంతరం రాజయ్యాడు. హయగ్రీవుడు అసమర్థుడు కావటంతో, అతడికి ఇంటా-బయటా కూడా అవమానాలూ, అవహేళనలూ ఎదురవ్వసాగాయి. ఆ పరిస్థితి హయగ్రీవుడి కంటే, అతడి గురువైన పుళిందభట్టారకుణ్ణే ఎక్కువగా బాధించింది.

పుళిందుడు మహామంత్రవేత్త. శిష్యుడైన హయగ్రీవునిపట్లగల అవ్యాజానురాగం కొద్దీ అతడు, తన శక్తియుక్తులన్నీ ఉపయోగించి, శిష్యుడికి సాయపడాలనుకున్నాడు. చాలా రోజులు దీర్ఘంగా ఆలోచించిన పుళిందభట్టారకుడు, చివరకు ఈ

మకు లోనయ్యారు. క్షణకాలంనోటమాట రానట్టు నిలబడిపోయిన విజయదత్తుడు, తర్వాత చేతులు జోడించి నమస్కరిస్తూ, "తల్లీ, దివ్యశక్తీ! నీ పట్ల పరుషంగా మాట్లాడిన, నా అపరాధాన్ని మన్నించు! ఈ దివ్యసింహాసనం శిఖరభాగాన చెక్కివున్న, మా కులదేవతమూర్తిని చూసి, ఇది మాకు చెందినదేగదా అన్న ధీమాతో అధిష్ఠించబోయాను. అయితే, ఊహించని విధంగా ఎదురైన నీ వారింపు, నాలో అనేక ప్రశ్నలనూ, అనుమానాలనూ రేకెత్తిస్తున్నది. ఈ స్వర్ణసింహాసనం ఎవరికి చెందినది? దీనికి కాపలాగావున్న మంత్రబద్ధ భుజంగాన్ని గెలిచి, ఈ సింహాసనాన్ని సాధించిన నన్ను వారించటంలో, నీ ఉద్దేశ్యమేమిటి? దయచేసి చెప్పు, తల్లీ!" అన్నాడు.



అపూర్వ సింహాసనానికి రూపకల్పన చేశాడు.కావలసినబంగారాన్ని, మణులను సమకూర్చుకుని, నమ్మకస్థులైన స్వర్ణ కారులద్వారా, రహస్యంగా పని ప్రారంభిం చాడు. ఈ సింహాసనం తయారవుతున్న సంగతి, హయగ్రీవుడికి కూడా తెలియదు.

భౌతికంగా, ఈ స్వర్ణ సింహాసం తయారైన తర్వాత, పుళిందభట్టారకుడు తన మంత్రశక్తినంతటినీ వినియోగించి, మూడు గొప్ప దివ్యశక్తులను, కుడివైపున మూడు మెట్లమీదవున్న మూడు సాలభంజికల్లోకీ ఆవాహనచేసి, భౌతికచలనం లేకపోయినప్పటికీ, మానసికచలనం కలిగేలా ప్రాణ ప్రతిష్ఠచేశాడు. ఆ మూడుదివ్యశక్తులమూ మేమే! నేను సత్యాన్ని, రెండవమెట్టుమీద వున్నది ధర్మం! ఆఖరి మెట్టుమీద వున్నది న్యాయం!మాకుఎదురుగా, ప్రతిమెట్టుకూ ఎడమవైపున వున్న మిగిలిన మూడు సాలభంజికల్లోనూ, మా సహాయకశక్తులున్నవి. అవి కూడా సత్య, ధర్మ, న్యాయ శక్తులే! అయితే, అవి స్థూలశక్తులు; మేము సూక్ష్మశక్తులం!

రాజధర్మంచాలా సూక్ష్మమైనది. సత్యమూ, ధర్మమూ, న్యాయమూ, వీటి తాలూకూ సూక్ష్మరూపాలనూ, సూక్ష్మధర్మాలనూ అర్థం చేసుకుని, సరిగ్గా ఆచరించగలిగిన వాడే ఉత్తమపాలకుడవుతాడు. రాజ్యపు సుస్థిరత అనే మహాభవనానికి, సత్యమూ, ధర్మమూ, న్యాయమూ మూడు మూల స్తంభాలుకాగా, వాటిని రాజ్యంలో సక్రమంగా అమలుపరచగలిగేరాజు నాలుగవ మూలస్తంభం. ఈ నాలుగవ స్తంభానికి, ఏమాత్రం శక్తిహీనతవాటిల్లినా, మిగిలిన మూడు స్తంభాలూ కూడా పట్టుకోల్పోయి, రాజ్యపు సుస్థిరత కుప్పకూలిపోతుంది.

రాజధర్మాన్ని అర్థంచేసుకున్న మహా పురుషుల్లో, మీ పూర్వీకుడైన పౌరస్వత మహారాజు ఒకడుగా నిలిచాడు. ఆయన వారసుడైన హయగ్రీవుడికి, ధర్మపు స్థూల రూపమేగాని, సూక్ష్మరూపం తెలియదు. ఇందుకు, హయగ్రీవుడికి మమ్మల్ని సహాయకాలుగా నిర్దేశించే ఉద్దేశ్యంతో, ఈ సాలభంజికల్లోకి ఆవాహన చేశాడు, పుళిందభట్టారకుడు.

అయితే, ఎంతటివాడైనా విధికి ఎదురీదలేడుగదా! పుళిందభట్టారకుడు, ఈ అపురూపమైన స్వర్ణసింహాసనానికి తుది



మెరుగులు దిద్దుతూండగా, హయగ్రీవుడు ఆకస్మికంగా మరణించాడు. కన్నబిడ్డకంటే ఎక్కువగా రాజును అభిమానించిన పుళిందుడికి, అతడిమరణం గొడ్డలి పెట్టు అయింది. జీవితమంటే విరక్తి కలిగింది. తక్షణమే సమస్తాన్నీ త్యజించి, సన్యాసా శ్రమాన్ని స్వీకరించాలని నిశ్చయించు కున్న ఆయనకు, ఈ స్వర్ణసింహాసనాన్ని ఏం చేయాలన్నది పెద్ద ప్రశ్న అయింది. హయగ్రీవుడి కోసం ఉద్దేశించి, అహో రాత్రాలు కష్టపడి తయారుచేసిన దీన్ని, అతడివారసులకు ఏదో కానుకగా కట్ట బెట్టటం పుళిందుడికి ఇష్టంలేకపోయింది.

రోజులతరబడి తీవ్రంగా ఆలోచించిన పుళిందుడు, చివరకు ఒక నిశ్చయానికి వచ్చాడు. హయగ్రీవుడికి చెందని ఈ అపూర్వ కానుక, ముందు ముందు దక్కితే... ఒక సమర్థుడైన పాలకుడికి మాత్రమే దక్కాలి. అసమర్థుడైన హయ గ్రీవుడికి సహాయకారిగావుంటుందనుకున్న, ఈదివ్య సింహాసనం, ఒక సమర్థుడికే సహాయశక్తిగామారిననాడు,అతడు రెండవ పౌరస్వతుడే కాగలడు! స్వర్ణ సింహాసన సృష్టికర్తగా తన పేరూ, అంతటి గొప్ప సింహాసనాన్ని అధిష్ఠించగలిగిన వ్యక్తి పేరూ, చరిత్రలో చిరస్థాయిగా నిలిచి పోతాయి. తక్షణమే అటువంటి సమర్థుణ్ణి నిర్ణయించటం ఎలాగో కూడా నిశ్చయించాడు, పులిందభట్టారకుడు.

తన మంత్రశక్తితో, అవలీలగా ఈ సింహాసనాన్ని భూస్థాపితం చేసిన పుళిం దుడు, ఒక మంత్రభుజంగాన్ని సృష్టించి, కాపలాగా నియమించాడు. ఆ భుజంగం అడిగే ప్రశ్నద్వారా, ఈ సింహాసనాన్ని పొంద బోయే వ్యక్తికి, అసలు ధర్మపు స్థూలరూపం తెలుసునా లేదా అన్నది, నిశ్చయించ బడుతుంది. అతడు సర్పం అడిగిన ప్రశ్నకు సరైన జవాబు చెప్పి సింహాసనాన్ని లభింపజేసుకున్న తర్వాత, అతడికి ధర్మపు సూక్ష్మరూపం తెలుసునా తెలియదా అన్నది నిర్ణయించటం, మావంతు!

మొదటి పరీక్షలో నెగ్గి, సింహాసనాన్ని సొంతం చేసుకున్న నీకు, మేంముగ్గురం తలొక కథ చెబుతాం. ఆ కథల చివర్లో, మేం వేసే ప్రశ్నలకు సరైన జవాబులు చెప్పగలిగావా, ఈ మూడు మెట్లూ ఎక్కి ఈ దివ్యసింహాసనాన్ని అధిష్ఠించి ప్రజా

రంజకంగా పాలించే అవకాశం నీకు దక్కుతుంది. అంతేకాదు. హయగ్రీవుడి కోసం పుళిందభట్టారకుడు సృష్టించిన మరొక అపూర్వవస్తువు - మంత్రశక్తిగల చంద్రహాసం! అది కూడా నీకు దక్కు తుంది. మాలో ఏ ఒక్కరికైనా నువ్వు సరైన జవాబు చెప్పలేక పోయినా, నీ మెడలో తెల్లని కాంతులు వెదజల్లుతున్న ఆ పూల దండతో సహా, ఈ స్వర్ణసింహాసనం మాయమై, తిరిగి యథాస్థానానికే చేరు తుంది!" అన్నది.



అప్పటిదాకా నిశ్శబ్దంగా సాలభంజిక మాట్లాడుతున్న మాటల్ని వింటున్న యావ న్మందిలోనూ తిరిగిచలనం కలిగింది. వాళ్ళమధ్య నెమ్మదిగా గుసగుసలు ప్రారంభమయ్యాయి.

అప్పటివరకూ తన కుమారుడికి, ఒక అపురూపమైన సింహాసనం లభించిందన్న తృప్తితో, నిశ్చింతగావున్న మహారాజు శ్రీదత్తుడిలో, తిరిగి ఆందోళనా, ఆరాటమూ చోటుచేసుకున్నాయి. విజయదత్తుడి ఎడమవైపున్న శ్రీలేఖ, కుడివైపున, చేత కలశంతో నిలబడివున్న శివానందులతో సహా, ఉన్నతోద్యోగులందరూ, ఒక్కసారిగా విజయదత్తుడి వైపు ఆతృతగా చూశారు. అందరిలోకీ చెక్కుచెదరని వాడు విజయ దత్తుడు ఒక్కడే!

అతడు వెనుదిరిగి, తండ్రివైపు చూస్తూ, "నాన్నగారూ! ముందుకు సాగటానికి ఇక నాకు కావలసినది, మీ అనుమతి, ఆశీ స్సులే!" అని వంగి, ప్రణమిల్లాడు.

తన పాదాలుతాకుతూ వంగిన కొడు కును, అమాంతంలేవనెత్తి, గాఢాలింగనం చేసుకుని వదులుతూ, "నాయనా! విజయీభవ! దిగ్విజయీభవ!" అన్నాడు.

అప్పుడు విజయదత్తుడు, సింహాసనం కేసి తిరిగి, తొలిమెట్టు మీదవున్న సాల భంజికకు నమస్కరిస్తూ, "తల్లీ, సత్యశక్తీ! నువ్వు పెట్టబోయే పరీక్షకు నేను సిద్ధంగా వున్నాను. ఇక నీదే ఆలస్యం," అన్నాడు.

వెంటనే మొదటి సాలభంజిక, "నాయనా, విజయదత్తా! నీ ధీరోదాత్త ప్రవర్తనకు, ఇవే నా అభినందనలు! ఇక నేను చెప్పబోయే కథ విను..." అంటూ చెప్పటం ప్రారంభించింది:

పూర్వం త్రిపురాంతక దేశాన్ని, కాలకేతు అనే మూర్ఖరాజొకడుపాలిస్తూండేవాడు.



అతడికి ఇటు స్వయంబుద్ధీ లేదు, అటు బుద్ధిమంతులైనవారి సలహా సహకారాలతో పాలన సాగిద్దామనే సామరస్యమూ లేదు. సింహాసనాన్ని అధిష్ఠించి, అధికార దండాన్ని చేతబట్టినవాడు, సాక్షాత్తూ భగవత్ స్వరూపుడేననీ, అతడికి ఎవరినీ సంప్రదించాల్సిన అవసరంలేదనీ, కాలకేతు నమ్మకం. ఆ నమ్మికకు అనుగుణంగా అతడు కేవలం స్వబుద్ధితో పాలిస్తూ, దేశాన్ని అధోగతికి దిగజార్చాడు. దేశంలో మెరకప్రాంతాలకు జలసదుపాయం అంతంతమాత్రంగానేవుండటంతో కేవలం వర్షాధారపు పంటలు మాత్రమే అక్కడ పండేవి. పోతే, కళల విషయానికొస్తే, అందగత్తెలైన నాట్యకళాకారిణులకూ, స్త్రీసౌందర్యాన్ని రమ్యంగా సృష్టించగల చిత్రకారులకూ, శిల్పులకూ మాత్రమే, రాజాదరణ ఏదో కొంతలభించేది. పూర్తిగా మానసిక పరిపక్వతకు సంబంధించిన కవిత్వం మాత్రం రాజు నిరాదరణకు గురైంది. గొప్పగొప్పకవులంతా పరాయి దేశాలకు వలసపోవటం సాగించారు. అక్కడి రాజులు వారి గొప్పతనాన్ని గుర్తించి, ఆదరిస్తున్నారన్న వార్త విన్న కాలకేతుడు, "ఛీ,ఛీ! మనదేశస్థులు మరొకరిని దేహీ అని ఆశ్రయించి బ్రతకటమా? అది మనకు ఎంతటి అగౌరవం!" అని మండిపడుతూ, స్వదేశపుటెల్లలు దాటిపోవటానికి, గండుచీమకు కూడా అవకాశం లేనివిధంగా కట్టడిచేశాడు. అదిచాలక, దేశగౌరవం మట్టిపాలు కావటానికి, కవిత్వమే కారణమని చీదరించుకుంటూ—నాటినుంచి, కవిత్వం చెప్పినా, విన్నా, రాసినా, వారికి దారుణమైన శిక్షలు విధించటం ప్రారంభించాడు.

కాలకేతుడి ఈ అనుచితప్రవర్తన వల్ల, దేశప్రజలకంటే ఎక్కువ ఆత్మక్షోభ అనుభవించే వ్యక్తి, స్వయానా అతడి పుట్టపురాణి హైమవతి. ఆమె సంస్కృత భాషతో పాటు మాతృభాషలో కూడా చక్కని పండితురాలూ, కవయిత్రీకూడా. భర్త మూర్ఖపు శాసనానికి, ఆమె అతీతురాలు కాదు గనుక, తన మనసులోని భావావేశాలను బలవంతంగా అణచుకునేది.

కవిత్వం విషయం అలావుంచితే, నిజ జీవితంలో కూడా హైమవతికి సుఖశాంతులు వుండేవి కావు. హైమవతికి సంతానం

కలగలేదంటూ, ఆమెను పెళ్ళాడిన నాలుగేళ్ళలోనే, మరిద్దరు కన్యలను వివాహమాడినకాలకేతుడు, ముగ్గురు రాణుల్ని కూడా సామాన్య స్త్రీలలాగే చూసేవాడు. ముగ్గురిలో ఎవరికి కూడా సంతతి లేకపోవటంతో, వారిపట్ల అతడి చులకనభావం నానాటికీ పెరగసాగింది.

ఇలా రోజులు గడుస్తూండగా, భగవంతుడు కూడా త్రిపురాంతకదేశం మీద కత్తి కట్టినట్టుగా, వరసగా రెండేళ్ళపాటు దేశంలో ఎక్కడా ఒక్కవర్షపు చుక్కకూడా పడలేదు. పొలాలకు నీటి సదుపాయాలు కల్పించటం తక్కువా, వర్షాలపై ఆధార పడటం ఎక్కువా, అయిన దేశం కావటం చేత, పొలాలన్నీ బీటలువారిపోయాయి. ఒక ఏడాదిపాటు, నిలవచేసుకున్న తిండి గింజలు సరిపోయినా, రెండో ఏడాదికి, ఒక్క గింజకూడా లేకపోయింది. ఇక గతి లేని స్థితిలో రాజుకాలకేతు, పొరుగుదేశాలనుంచి ఆహారధాన్యాలు తెప్పించి, రాజోద్యోగులచేత అధిక ధరలకు విక్రయించటం ప్రారంభించాడు.

ఈ పరిస్థితుల్లో, ఉన్నవాడికి తిండీ, లేనివాడికి పస్తుగా మారి, పేదవాళ్ళకు దొంగతనం మినహా, మరొక దారి లేక పోయింది. నాలుగు నెలలు గడిచేసరికి, దేశమంతటా దొంగతనాలూ, లంచగొండితనమూ విపరీతంగా వ్యాపించాయి. రెండు నెలలు గడిచే సరికి, చిన్న చిన్న దొంగతనాలు పోయి, రాజాస్థానంలోనే, ఒక ముసుగువ్యక్తి, నాయకత్వంలో భారీ దొంగతనాలు జరగటం ప్రారంభించాయి.

ఆ ముసుగు వ్యక్తి గురించిన అనేక వివరాలు, కథలు కథలుగా త్వరలోనే ప్రచారంలోకి వచ్చాయి. అతడి పేరు చిత్రరథుడు. త్రిపురాంతక దేశంలో, ఎంతో మహిమగల దైవంగా ప్రసిద్ధి పొందిన చిత్రరథస్వామి వరప్రసాదంగా తల్లిదండ్రులకు జన్మించిన అతడు, యుద్ధవిద్యల్లోనూ ఎన్నదగిన వ్యక్తి. అతడు దొంగగా ఎలా మారాడో ఎవరికీ తెలియదుగాని, దొంగతనంచేసి తెస్తున్న ఆహారధాన్యాలను, వస్త్రాలను ధనాన్ని తన అనుచరులచేత బీదసాదలకు విరివిగా పంచిపెట్టిస్తుండటంతో, పేదప్రజలకు అతడు సాక్షాత్తూ చిత్రరథస్వామి అపరావతారమే అయ్యాడు.

ఇలారోజులు గడుస్తూండగా, ఒక చిత్రమైన సంఘటనజరిగింది. *–(ఇంకావుంది)*



*ఒక గొప్ప నాగరికతలోని ఘట్టాలు–*
*తరతరాలుగా సత్యంకోసం జరిగిన అన్వేషణ!*

## 4. పవిత్రనది జన్మ వృత్తాంతం!

ఆ రోజు ఆదివారం సెలవు కావడంతో సాయంకాలం వరకు ఆగకుండా శ్యామల ఉదయమే తాతయ్య గదిలోకి వెళ్ళింది. దేవనాధుడు అప్పుడే వార్తాపత్రిక చదివి పక్కన పెట్టాడు. శ్యామల నవ్వుతూ వెళ్ళి ఒక్క గెంతున తాతయ్య ఒడిలో కూర్చున్నది. అంతలో సందీపుడు కూడా అక్కడికి వచ్చి తాతయ్యకు ఎదురుగావున్న సోఫాలో కూర్చున్నాడు.

దేవనాధుడి కుమారుడు శ్రీకరుడు తండ్రి గదిలోకి ప్రవేశిస్తూ, "తెల్లవారక ముందే తాతయ్యను ముట్టడించి, ఆయనపై యుద్ధం మొదలు పెట్టారేమిటి?" అన్నాడు పిల్లలను కొద్దిగా గద్దిస్తున్నట్టు.

"అవును, నాన్నా! తాతయ్య జ్ఞానాన్ని దోచుకోవడానికి యుద్ధం చేస్తున్నాం!" అన్నది శ్యామల లేచివెళ్ళి సందీపుడి పక్కన కూర్చుంటూ.

"నాన్నా, శ్యామల నిజంగానే ఒక బందిపోటు. అయితే, ఆ బందిపోటు ఎంత దోచుకున్నప్పటికీ తాతయ్య దగ్గరున్న జ్ఞాననిధి మాత్రం తరగదు. ఇంకా పెరుగుతుంది. అందుకే నేనూ ఆ ముట్టడిలో పాల్గొంటున్నాను," అన్నాడు సందీపుడు తండ్రితో.

పిల్లల వాక్చాతుర్యాన్ని మనసులో మెచ్చుకుంటూ, శ్రీకరుడు చిన్నగానవ్వి, తండ్రినుంచి పత్రికను అందుకుని గది నుంచి వెలుపలికి నడిచాడు.

"తాతయ్యా! గంగానది పవిత్రతకుకారణం ఏమిటో చెబుతానన్నారుగా, ఇప్పుడుచెప్పండి!" అన్నది శ్యామల.

దేవనాధుడు వాలుకుర్చీలో కాస్సేపు మౌనంగా కూర్చుని, ముందుకు వంగి, "భారత దేశఔన్నత్యాన్ని యుగయుగాలుగా ప్రపంచానికి చాటుతూన్న పర్వత శ్రేణులు హిమాలయపర్వతాలు అని మీకు తెలుసు. నిజానికి అదొక విచిత్ర ప్రదేశం. మనకు కనిపించని విచిత్ర ప్రపంచాలెన్నో అక్కడ ఉన్నాయని విజ్ఞులు చెబుతారు," అన్నాడు.

"ఎన్నో ప్రపంచాలు అంటే ఏమిటి తాతయ్యా?" అని అడిగాడు సందీపుడు.



# స్మృతి-చరిత్ర



"కేవలం భౌతిక ప్రపంచమే ప్రపంచం కాదు. మనకు కనిపించని ప్రపంచాలు చాలా ఉన్నాయి. వాటి ఉనికికి భౌతికంగా స్థలం అవసరం లేదు. ఒకే కాలంలో, ఒకే స్థలంలో అనేక ప్రపంచాలు ఉండగలవు," అన్నాడు దేవనాథుడు.

"కంటికి కనిపించవు అంటున్నారు. మరి వాటిని తెలుసుకోవడం ఎలా తాతయ్యా?" అని అడిగింది శ్యామల అనుమానంగా.

"నా మనసు మీకు కనిపిస్తున్నదా? లేక కనీసం మీ మనసైనా మీకు కనిపిస్తున్నదా? అంత మాత్రాన అసలు మనసులే లేవని చెప్పగలమా? వాటిని మన అనుభవం ద్వారా తెలుసుకుంటున్నాం. అలాగే అదృశ్యలోకాలను గురించి, మన మునులు, ఋషులుతమ అనుభవాల ద్వారా మనకు తెలియ చేశారు. అదిసరే, ఇప్పుడు మీకు పావన గంగ ఆవిర్భావం గురించి చెబుతాను, వినండి," అంటూ ఇలాచెప్ప సాగాడు:



ఒకానొకప్పుడు నారదముని భూలోకం నుంచి మహావిష్ణువు కొలువుండే గోలోకానికి తిరుగు ప్రయాణమయ్యాడు. వీణవాయిస్తూ, భక్తితో నారాయణ నామాన్ని గానం చేస్తూ— హిమాలయ పర్వతాలనూ, వాటి మధ్యవున్న సుందర సూక్ష్మలోకాలనూ చూస్తూ ముందుకు సాగాడు. అది పున్నమిరేయి. ఉన్నత శిఖరాల మధ్య ఒక బంగారులోయలో కొందరు సుందర పురుషులూ, స్త్రీలూ కనిపించారు. వారి రూపాలూ, మందహాసాలూ నారదుణ్ణి అలరించాయి. సమీపించగానే వారందరూ ఆయనకు నమస్కరించారు.

"మీరెవరు?" అని అడిగాడు నారదుడు.

"మేము రాగరాగిణుల ఆత్మలమయిన గంధర్వులం," అన్నారు వారు.

"అలాగా! చాలా సంతోషం,"అంటూ నారదుడు వారికి ప్రతినమస్కారం చేశాడు.

వారందరూ సంగీత దేవతలు. ఒక్కొక్కరు ఒక్కొక్క రాగానికి అధిదేవతలవంటివారు. వారు లేకుంటే సంగీతమే లేదు. వారిని పరిశీలనగాచూసిన నారదమునికి ఒక వింత సంగతి తెలియ వచ్చింది. వారిలో కొందరికి బుగ్గలపై గాట్లు; మరి కొందరికి నొసళ్ళపై గాయాలు; తలపై బొడిపలు; ఇంకా కొందరికి ఒళ్ళంతా వాతలు ఇలా కనిపించాయి. దానిని చూసిన ముని, "ఏమిటివన్నీ? మీ శరీరాల మీద గాయాలెలా తగిలాయి?" అని అడిగాడు ఆశ్చర్యంగా.

"మా బాధలు మేము అనుభవిస్తున్నాము. మీ కెందుకులెండి," అన్నారు గంధర్వులు బాధగా.



అయినా అసలు సంగతి చెప్పేంతవరకు నారదముని వదల లేదు. ఆఖరికి వారు, 'గాయనీ గాయకులుతాము ఆలపించే రాగం పట్ల భక్తిశ్రద్ధలు కనపరచకుండా, రాగాన్ని దర్పంతో ఆలపించినా, తప్పుగా పాడినా ఆయా రాగాలకు ఆత్మలమైన మా శరీరాలకు



గాయాలు తగులుతాయి. అదేవిధంగాసంగీత వాయిద్యాలను తప్పుగా వాయించినా మా శరీరాల మీద గాయాలు ఏర్పడతాయి. ఆ బాధలను మేమిలా ఎంతో కాలంగా అనుభ విస్తున్నాము," అన్నారు విచారంతో.

నారదుడు ఒక్కక్షణం బాధతో తలవంచు కున్నాడు. ఆ తరవాత, "మీ గాయాలను పోగొట్టే మార్గమే లేదా?" అని అడిగాడు.

"లేకేం? పరిపూర్ణగాయకుడు ఆలపించే గీతాన్ని మేము ఆలకించినట్టయితే మా గాయాలు మటుమాయమై, అంగవైకల్యాలు తొలగి పోతాయి," అన్నారు గంధర్వులు.

'పరిపూర్ణగాయకులెవరో చెబుతారా?" అని అడిగాడు నారదుడు.

'పరమశివుడొక్కడే పరిపూర్ణ గాయకుడు. అయినా, ఆయన మాకోసం పాడగలడా?" అన్నారు గంధర్వులు అనుమానంగా.

"శివుడు పరమకరుణాస్వరూపుడు. తప్ప కుండా మన ప్రార్థన మన్నిస్తాడు," అని నారదుడు అక్కడి నుంచి కైలాసానికి వెళ్ళి శివుడికి విషయం చెప్పాడు. అంతా విన్న పరమశివుడు, "పాడడానికి నాకు అభ్యంతరం లేదుగాని, కనీసం ఒక్క పరిపూర్ణ శ్రోత అయినా ఉంటే తప్ప నేను పాడలేను. అదీ సమస్య!" అన్నాడు.

"ముల్లోకాలలో పరిపూర్ణశ్రోతలు ఎవరు?" అని అడిగాడు నారదుడు.

"ఇద్దరే ఇద్దరు. బ్రహ్మవిష్ణువులు!" అని చెప్పాడు శివుడు.

నారదుడు బ్రహ్మ విష్ణువులను సందర్శించి, సంగతి చెప్పాడు. అటువంటి అపూర్వ అవకాశం కలిగినందుకు ఇరువురూ పరమా నందం చెందారు. తమ అంగీకారాన్ని తెలియ జేశారు.

శివగానానికి కైలాసంలో ముహూర్తం నిర్ణ యించబడింది. బ్రహ్మవిష్ణువులు కైలాసానికి విచ్చేశారు. నారదుడూ, గంధర్వులూ కైలాస గిరిని చేరి శివుడి పాదాల చెంత ఆసీనుల య్యారు. కొంతసేపు ప్రశాంత గాంభీర్యం తర వాత పరమశివుడు మెల్లగా గీతాలాపన ఆరం భించాడు. అక్కడి వాతావరణమంతా అనిర్వ చనీయమైన ఆనందంతో నిండిపోయింది. ఆ మధుర గంభీరగానానికి ఆకర్షించబడి దేవతలం దరూ అక్కడికి తరలివచ్చారు. రాగరాగిణుల శరీరాలపై గాయాలన్నీ నయమైపోయాయి.

అప్పుడొక అద్భుతం జరిగింది. పరమశివుడి గానానికి తన్మయత్వం చెందిన మహావిష్ణువు మంత్రముగ్ధుడైనట్టు అయిపోయాడు. ఆయన శరీరం చుట్టూవున్న ప్రకాశంలోని వెలుపలి పొర శివగానానికి కరిగి కిందికి జారసాగింది. ఆ అద్భుతాన్ని గమనించిన బ్రహ్మ తన కమండలంతో, కరిగిన విష్ణు ప్రకాశజలాన్ని పట్టుకున్నాడు. బ్రహ్మ కమండలంలో ఆ పవిత్రజలం ఎంతకాలం ఉందో ఎవరికీ తెలియదు. అదే ఆకాశగంగగా ప్రవహించసాగింది. ఆ పావన గంగనే భగీరథుడు భూలోకానికి రప్పించాడు.

"అద్భుతం!" అన్నాడు తలుపు దగ్గరనిలబడ్డ శ్రీకరుడు. దేవనాధుడు తలతిప్పి చూశాడు.

"మీరు కథ చెప్పడం ఆరంభించాక పత్రిక చదవడం కూడా మరిచిపోయి, దానినివింటూ ఇక్కడే నిలబడ్డాను. గంగ ఆవిర్భావానికి వెనక ఇంతటి అద్భుతమైన కథ వుందని నాకు ఇంతవరకు తెలియదు!" అన్నాడు శ్రీకరుడు.

"నువ్వు పసివాడుగా ఉన్నప్పుడు, ఇతర పరిశోధనలలో పడి నీకు ఇలాంటి కథలు చెప్పలేక పోయాను. ఇప్పుడు నీ పిల్లలకు కథలు చెప్పడమే ఒక తపస్సుగా భావిస్తున్నాను," అన్నాడు దేవనాధుడు.

"మాకు కథలు చెప్పడం తపస్సెలాఅవుతుంది తాతయ్యా?" అని అడిగాడు సందీపుడు.

"అవును, అదితపస్సే. అసలు తపస్సంటే ఏమనుకున్నావు? మనల్ని పునీతుల్ని చేసేది; ఉన్నత స్థితికి చేర్చేది," అన్నాడు దేవనాధుడు.

"నాన్నా, ఈ కథలోనూ ప్రతీకలుంటాయనుకుంటాను," అన్నాడు శ్రీకరుడు.

"అవును. ఇందులో చాలా ప్రతీకలున్నాయి. సంగీతం, నాట్యం మొదలైన జీవకళలన్నిటికీ మూలాధారం పరమశివుడు. ఆయనలో సంగీతం వినిర్మలరూపంలో వుంటుంది. ప్రపంచమంతా అంతర్లీనంగా వ్యాపించివున్న ఒకవిధమైన లయకు సంకేతం సంగీతం! క్రమం, లయ ఒడిదుడుకులను సరిదిద్దుతుంది. సంబద్ధత, అసంబద్ధతలన్నిటినీ తొలగిస్తుంది. అందువల్లనే పరిపూర్ణసంగీతానికి ఉన్న అద్భుతశక్తి కారణంగానే గంధర్వులు తమ పూర్వరూపాలను పొందారు. పరిపూర్ణ శ్రోత, సంగీతంతో ఒకటవుతాడు. దానితో కలిసి కరిగిపోతాడు. మహావిష్ణువు నిత్యమైన అమర చైతన్యానికి సంకేతం. ఆయన దివ్య ప్రకాశం నుంచి ఆవిర్భవించిన పావన గంగ మరణించిన వారిని మళ్ళీ సజీవుల్ని చేయడంలో ఆశ్చర్యం ఏముంది?" అంటూ దేవనాధుడు లేచినిలబడ్డాడు. —(ఇంకావుంది)



# తాయెత్తూ-దోమలూ

కోనయ్య అనేవాడు పనిమీద పట్నానికి వెళ్ళాడు. వాడు ఒక పెద్ద వీధి వెంట నడుస్తూండగా, దాపులనున్న ఒక చింతచెట్టు కింద కొందరు మనుషులు గుంపుగా చేరి వుండడం కంటబడింది.

కోనయ్య అక్కడికి వెళ్ళి, జనంమధ్యగా దారిచేసుకుని కాస్త ముందుకు వెళ్ళాడు. చెట్టుబోదెనానుకుని, పులిచర్మం మీద ఒకడు కూర్చుని వున్నాడు. పొడవాటి తెల్లని గడ్డం, నుదుటిమీద ఇంతమందాన విభూదీ, మెడలో రుద్రాక్షలూ-చూపులకు గొప్ప మంత్రవేత్తలా వున్నాడు.

జనం చెప్పుకుంటున్న మాటలనుబట్టి, ఆ మంత్రవేత్త రెండు రోజులకిందటే, ఆ చెట్టు కింద చేరాడనీ, ఎటువంటి ఈతిబాధలనైనా, మహిమగల తాయత్తుతో కుదర్చగలడనీ, కోనయ్యకు తెలిసింది. ఐతే, ఆ తాయత్తు ఖరీదు ఐదురూపాయలు. అలా వచ్చిన డబ్బుతో ఆయన వింధ్యపర్వతాల్లోవున్న ఒక శిథిల దేవాలయాన్ని పునరుద్ధరించబోతున్నాడు.

కోనయ్య, ఈ మధ్య పెరట్లో బావి తవ్విస్తున్నాడు. ఇరవై అడుగుల లోతు తవ్వినా, ఉప్పునీళ్ళు తప్ప మంచి నీళ్ళు పడే జాడలు కనిపించడం లేదు. ఇందుకు మహిమగల తాయత్తు ఉపయోగపడుతుందేమో కనుక్కుందామని దుస్తుల్లో దాచిన డబ్బులోంచి, ఐదురూపాయలు తీసి మంత్రవేత్త దగ్గరకు వెళ్ళబోయాడు.

అంతలో, ఒక ముసలివాడు జనాన్ని తోసుకుంటూ ముందుకు వచ్చి, మంత్రవేత్తతో, "స్వామీ, దోమలు మరి పడకగదిలోకి రావని మీరిచ్చిన తాయత్తు పనిచేయలేదు. రాత్రి కంటిమీద కునుకు లేదంటే నమ్మండి!" అన్నాడు.

మంత్రవేత్త అతడికేసి ఆశ్చర్యంగా చూస్తూ, "తాయత్తును నేను ఉపయోగించమన్న విధంగా ఉపయోగించావా? దాన్ని దోమతెరలోపల పెట్టాలి. ఆ పని చేశావా,?" అని అడిగాడు.





# అపకారంలో ఉపకారం

ఒకానొకప్పుడు భువనగిరిని హేమశంక రుడనే రాజు ఏలుతూండేవాడు. పరిపాలనా దక్షతతో పాటు కళాపోషణలో కూడా ఆయన పేరుపడ్డాడు.

ప్రతి సంవత్సరం హేమశంకరుడు కొద్ది రోజుల పాటు కొత్త ప్రదేశంలో, రాజ్యవ్యవహారాలకు దూరంగా రాణితో గడిపివచ్చే వాడు. ఆసమయంలో రాజు, రాణి ప్రకృతి దృశ్యాలను తప్పవేటినీ పట్టించుకునేవారు కాదు.

ఆ విధంగా ఒకసారి రాజు, రాణి అరుణాచలమనే ఊరు వెళ్ళారు. అది రెండు కొండల నడుమ వున్నది. ఎంతో మంది కాప్రాంతం గురించి తెలియదు కానీ - ప్రకృతి సౌందర్యంలో ప్రత్యేకతవున్న ఊరది.

అక్కడ కొత్తరకం చెట్లున్నాయి. కనీ వినీఎరుగని రంగురంగుల పూలున్నాయి. ఊరుకు అందాన్నివ్వడానికా అన్నట్లు వంపులు తిరిగి ప్రవహించే సెలయేరున్నది. ఆ సెలయేట్లో వెండి, బంగారాల్లా మెరిసే చేపలున్నవి. ఇవన్నీ చాలవన్నట్లు- ఏటా ఒకానొక రుతువులో, ఎక్కడినుంచో వివిధ జాతుల పక్షులు వలసకు వచ్చి, కొంతకాలముండి వెళ్ళిపోతాయి. ఆ ఊరెంత బాగుంటుందంటే-ఆపక్షులక్కడ వాలితేనే అందమనిపిస్తుంది!

హేమశంకరుడు అరుణాచలం చేరిన రెండురోజులకు వలసపక్షులు వచ్చాయి. రాజు,రాణి ఆ ఊరి అద్భుత సౌందర్యానికి మురిసిపోయారు. రాణికైతే శాశ్వతంగా అక్కడే వుండిపోవాలనిపించింది. వాళ్ళు అనుకున్నదానికన్న మరికొద్ది రోజులు అక్కడ గడిపి రాజధానికి వెళ్ళిపోయారు.

రాజధానిచేరిన రోజునే హేమశంకరుడు, తనకొలువులోపనిచేస్తున్న చపలుణ్ణిపిలిచి, వాడికిబంగారు నాణాలు బహూకరించాడు.

ఈ చపలుడు, రాజు కెంతో ఇష్టుడు. ఆయనకు నచ్చేమాటలు చెప్పడంలో అఖండుడు. వాడు అరుణాచలంలో పుట్టి పెరిగి పెద్దవాడై, ఆతర్వాత పొట్ట చేతపట్టుకుని వచ్చి భువనగిరిలో స్థిరపడ్డాడు. వాడు

"వసుంధర"




లందరినీ పిలిచి, ఒకచోట సమావేశ పరచండి. వారిని పోటీపడి కవిత్వం చెప్ప మనండి. ఉత్తమకవిని సన్మానించండి," అన్నాడు.

"నీ కోరిక సమంజసంగావున్నది," అని రాజు, చపలుణ్ణి మెచ్చుకున్నాడు.

చపలుడు ఈ విధంగా కోరడానికి కారణమున్నది. చాలాకాలంగా వాడికి తనకవిత్వం పదిమందికీ వినిపించాలని వున్నది. తను రాసిన కొన్ని కవితలను వాడు, లోగడ ఒకసారి ఆస్థానకవి చతురమతికి వినిపించాడు. ఆయన అవి విన్నాక వాడితో, "నువ్వు చాలా తెలివైనవాడివని చాలామంది అనుకుంటున్నారు. ఈ కవితలు వింటే, అందరూ నవ్వుతారు. రాజు విన్నాడంటే నిన్ను వేళాకోళం చేస్తాడు. నీ కవితలు నిన్ను చిన్నబుచ్చుతాయి!" అని హెచ్చరించాడు.

తనకవితలు బాగుంటాయని, చపలుడి నమ్మకం. ఆస్థానకవి తనంటే అసూయ పడ్డాడని, వాడి అనుమానం. కానీ, ఆయన మాటల్లో నిజముంటే, తనకు రాజు ప్రాపకంపోతుందని భయపడ్డాడు. అయితే, అప్పటి నుంచీ మంచి అవకాశంకోసం ఎదురుచూస్తున్నాడు. ఇప్పుడది రాగానే ఇలా ఉపయోగించుకున్నాడు.

అరుణాచలం చూసివచ్చిన వారందరితో కవితాగోష్ఠి ఏర్పాటయింది. అది వినడానికి ఎందరో శ్రోతలు ఉత్సాహంగా వచ్చారు. ఉత్తమ కవికి పదివేల వరహాలు బహుమానం. పోటీలో గతంలోనే కవులుగా

చెప్పడం వల్లనే రాజు ఈ పర్యాయం అరుణాచలం వెళ్ళాడు.

చపలుణ్ణి సన్మానించడంతో ఆగక రాజు, అరుణాచలం గురించి ప్రతి ఒక్కరివద్దా చెప్పసాగాడు. ఆసంవత్సరం, వలస పక్షులింకా ఎగిరిపోకుండానే, మరెందరో అరుణాచలం వెళ్ళివచ్చారు.

కొన్నాళ్ళుగడిచాయి. ఒకరోజున హేమశంకరుడు, చపలుడితో ఇష్టాగోష్ఠి చేస్తూ, "తలచుకున్నప్పుడల్లా అరుణాచలశోభ, నామనసునుపరవశింపచేస్తున్నది. నీకు ఏమైనా కోరికవుంటే చెప్పు!" అన్నాడు.

చపలుడు వెంటనే, "ప్రభూ! అరుణాచలంలో మరొక గొప్పతనమున్నది. ఆ ఊరు సరస్వతీప్రసన్నం. అక్కడికి వెళితే చాలు, మనిషిలో కవిత్వం పుట్టుకొస్తుంది. అరుణాచలం వెళ్ళివచ్చిన సామాన్యు

ప్రసిద్ధులైన వారు పాల్గొనగూడదు. కవిత్వం అరుణాచలం శోభ గురించే చెప్పాలి.

అప్పటికే కవులైనవారు పాల్గొనగూడ దన్న నియమంవుండడంతో, కవులుకాని వారందరికీ ఆశపుట్టింది. ఆవిధంగా అరుణా చలంచూసివచ్చిన వారందరూ ముందుకు వచ్చారు. పోటీ ప్రారంభానికి ముందు రాజు, ఆస్థానకవి చతురమతిని న్యాయనిర్ణేతగా ప్రకటించాడు.

దీనికి చపలుడు అభ్యంతరం చెబుతూ, "ప్రభూ! చతురమతి మహాపండితుడు. జీవితమంతా కావ్యాలతోగడుపుతున్నవాడు. సామాన్యుల కవిత్వంలో గుణదోషాలెన్నడం, ఆయనకు సాధ్యం కాదు. ఎందువల్ల నంటే, ఏకవితా ఆయనకునచ్చకపోవచ్చు. తమరు అరుణాచలం చూసి వచ్చారు. కవిత్వంలో ప్రవేశమున్నవారు. తమరే ఈ పోటికి న్యాయనిర్ణేతగా వ్యవహరించడం సమంజసం," అన్నాడు.

హేమశంకరుడు తటపటాయించాడు కానీ, చతురమతి కూడా చపలుణ్ణి బల పరచడంతో అంగీకరించక తప్పలేదు.

పోటీ ప్రారంభమయింది. అందరూ ఆశ్చర్యపడేవిధంగా ఎందరో సామాన్యులు అరుణాచలంపై చక్కని కవితలు వినిపిం చారు. ఆ పోటీలో చపలుడుకూడా పాల్గొని తన కవితలు చదివాడు.

అందరూ తమతమ కవికతలను విని పించడం అయ్యాక, చతురమతి, "ప్రభూ! నాదొక చిన్న మనవి. మనమందరం ఇప్పు డెన్నో చక్కని కవితలు విన్నాం. అరుణా




చల సందర్శనం వల్ల, కవులు కాని వారం దరూ కవులవుతారని ఋజువయింది. అయితే, దర్శనమాత్రానికే కవిత్వం పుట్టు కొస్తూంటే, అరుణాచలంలో పుట్టి పెరిగిన వాడికి నరనరాల్లోనూ కవిత్వమే ప్రవహిం చాలి. అటువంటి వారికి పోటీలో పాల్గొనే అర్హతవుండకూడదు. కారణం, లోగడేకవులైన వారిందులో పాల్గొనరాదు కదా!" అన్నాడు.

పోటీలో పాల్గొన్నవారిలో, అరుణాచ లంలో పుట్టి పెరిగినవాడు చపలుడొక్కడే!

హేమశంకరుడీ నిర్ణయాన్ని ఆమోదిం చడంతో, చపలుడింకేమీ మాట్లాడలేక పోయాడు.

పోటీ ముగిసింది. ఉత్తమ కవికే గాక, అర్థవంతమైన కవితలు వినిపించిన మరి కొందరికి కూడా రాజు తగిన బహుమతు లిచ్చి పంపాడు.

చపలుడికి, ఆస్థానకవి చతురమతి మీద ఆగ్రహం కలిగింది. ఒకప్పుడాయన తన కవితలువింటే నలుగురూ నవ్వుతారనీ, తనకు కవిత్వం రాదనీ అన్నాడు. ఈ రోజు కవిత్వం నరనరాలా ప్రవహిస్తున్నది కాబట్టి పోటీలో పాల్గొనే అర్హత లేదన్నాడు. ఈ విషయం రాజుకు చెబితే చతురమతిని క్షమించడు సరికదా, శిక్షించే అవకాశం కూడా వున్నది! ఇలా ఆలోచించి వాడు, రాజును కలుసుకుందామని అనుకుంటూండగా, వాడికి రాజునుంచే పిలుపు వచ్చింది. వాడు వెంటనే వెళ్ళాడు.

హేమశంకరుడు, వాణ్ణి చూస్తూనే, "ప్రియవాక్యాలతో నువ్వు, నన్నేమెప్పించ గలవనుకున్నాను. మన కొలువులో నీకింకా మంచిమిత్రులున్నట్లు తెలియదు. ముఖ్యంగా మన ఆస్థానకవిచతురమతికీ, నీకూ ఇంత స్నేహభావమున్నదని నేనెరగను. ఆ స్నేహభావమే, ఈ రోజు నన్నొక ధర్మసంకటంనుంచి కాపాడింది," అన్నాడు.

రాజు వ్యంగ్యంగా మాట్లాడుతున్నాడా అనిపించింది, చపలుడికి. లేకుంటే తనకు అపకారం తలపెట్టిన చతురమతికి, తన పట్ల స్నేహభావమా?

హేమశంకరుడు చెప్పుకుపోసాగాడు, "వంటికి అత్తరుపూసుకుంటే పరిమళం ఒకరోజు లేక రెండు రోజులుంటుంది. పూల సహజపరిమళమే, చెట్టునుంచివేరైన కాసేపటికి మటుమాయం. అరుణాచల విషయంలోనూ అంతే! నువ్వు అక్కడేపుట్టి పెరిగివుండొచ్చుకానీ అక్కడకు వెళ్ళిచాలా కాలమైంది. ఇటీవలనే అరుణాచలం చూసి వచ్చిన వారందరి కవిత్వంలోనూ ఎంతో కొంత పరిమళముంది. ఎప్పుడో చూసిన కారణంగా నీ కవిత్వంలో బొత్తిగా పసలేదు. నీకు బహుమతి యివ్వాలంటే, ఉత్తమకవికి అన్యాయం చేయడమే అవుతుంది. అందువల్ల, నిన్ను పోటీనుంచి తెలివిగా తప్పించిన చతురమతి, నన్ను ధర్మసంకటం నుంచి కాపాడాడు," అన్నాడు.

దీనితో చపలుడికి తనకవిత్వపు స్థాయి అర్థమైంది. చతురమతి కారణంగా తనకు బహుమతి రాకపోవడం అపకారమే అయినా- తమఅసమర్థత తెలియని అసమర్థులను పోటీనుంచి తప్పించడం వాళ్ళకు అపకారంలో ఉపకారం కాగలదని అసమర్థులందరూ తెలుసుకోవడం మంచిదే కదా! అనుకున్నాడు.



కావేరీ తీర ప్రయాణం-7

# ఆఖరి ద్వీపం

రచన: జయంతి మహాలింగం
చిత్రాలు : గౌతం సేన్



ఆలయ తటాకం (తెప్పకుళం) నుంచి కని పించే 'కొండకోట', దానిమీది ఆలయం

కావేరీనది ఇప్పుడు ఆగ్నేయదిశగా తిరిగి తిరుచిరాపల్లి జిల్లాలో ప్రవేశిస్తుంది. శ్రీరంగం చేరేంత వరకు నది విశాలంగా వుంటుంది. అందుకే దీనిని 'అఖండ కావేరి' అని భక్తితోచెప్పుకుంటారు. తమిళనాడు 'ధాన్యాగారం'గా పేరొందిన ఈ ప్రాంతంలో వరిపంట విరివిగా పండుతుంది. చెరకు, అరటి, తమలపాకుల తోటలు, కొబ్బరి తోటలు నదికి రెండు తీరాలలోనూ విస్తారంగా కనిపిస్తాయి.

ఈ ప్రాంతంలో హతుడైన 'తిరిసిరసు'డనే మూడు తలల రాక్షసుడి పేరు మీదుగా దీనికి 'తిరుచిరాపల్లి' అనే పేరు వచ్చిందని చెబుతారు. అదే తిరుచ్చి అయింది. తిరుచ్చి 'కొండకోట' శిఖరం నుంచిచూస్తే అఖండకావేరి దృశ్యం కన్నుల పండుగ చేస్తుంది. ఈ కొండకోటకు నిటారుగా 344 మెట్లు ఉన్నాయి. ప్రకృతి సిద్ధంగా ఏర్పడిన 83మీ॥ ఎత్తయిన బ్రహ్మాండమైన బండ మీద ఈ కోట ఉన్నది. ఈ బండ వయసు 38,000 లక్షల సంవత్సరాలు ఉండవచ్చని నిపుణులు అభిప్రాయ పడుతున్నారు. ప్రపంచంలోని అతి ప్రాచీనమైన బండలలో ఇది ఒకటి. క్రీ.పూ. 2వ శతాబ్దం - క్రీ.శ. 2వ శతాబ్దం మధ్యకాలంలో చోళులు మొట్టమొదట కొండమీద కోటను నిర్మించారు. ఆ కాలంలో తిరుచ్చి చోళుల రాజధానిగా ఉండేది. దీనిని 'మలైకోట్టై'(కొండకోట) అని అంటారు. ఎన్నో యుద్ధాలకు ఈ కోట సాక్షిగా నిలిచింది. 1751వ సం॥లో ఇంగ్లీష్-ఫ్రెంచి సేనల మధ్య జరిగిన యుద్ధాన్ని ఇటీవలి కాలంలో జరిగిన కీలకమైన యుద్ధంగా చెప్పవచ్చు. తిరుచ్చి దాదాపు మూడేళ్ళ ముట్టడిని అనుభవించింది. ఆఖరికి రాబర్ట్ క్లైవ్ అంతిమవిజయం సాధించాడు. ప్రస్తుతం ప్రధాన రక్షక ద్వారం ఒక్కటి మాత్రమే సురక్షితంగా ఉన్నది. కోట శిథిలావస్థలో ఉన్నది.



కొండమీది
విఘ్నేశ్వర ఆలయం

కొండశిఖరం మీద 'ఉచ్చిపిళ్ళయార్' కోయిల్ అనే విఘ్నేశ్వర ఆలయం ఉన్నది. కిందికి వెళ్ళే మార్గంలో బండలలో కొన్ని ఆలయాలు మలచబడి ఉన్నాయి. దక్షిణ పార్శ్వంలో మలచబడిన పల్లవ గుహాలయాలు వీటిలో ముఖ్యమైనవి. అక్కడి శాసనాల ద్వారా పల్లవ రాజు మొదటి మహేంద్రవర్మ (క్రీ.శ.600-630) కాలంలో అవి చెక్కబడ్డాయని తెలుస్తున్నది.

ఇక్కడ హైందవమతానికి చెందిన దేవతల విగ్రహాలు చెక్కబడి ఉన్నాయి. గంగాధరుడి శిల్పానికి దగ్గరవున్న శిలాశాసనంలో కావేరి సౌందర్యాన్ని కీర్తించే కవిత ఒకటి కనిపిస్తుంది: పల్లవరాజుకు ప్రియతమమైన కావేరి ఆయనకే చెందుతుంది. ఆమె నయనానందం కలిగిస్తుంది. ఇరు తీరాలలో పచ్చటి మైదానాలు, పంటపొలాలు ఆమె కంఠహారాలుగా అలంకరిస్తున్నాయి....

కొండపైనుంచి కిందికి వెళ్ళే మార్గ మధ్యంలో నూరు స్తంభాల మంటపంతో మాతృభూతేశ్వర ఆలయం అనే ఒక శివాలయం ఉన్నది. ఇక్కడి దేవుణ్ణి 'తాయుమానవర్' (తల్లి కూడా అయినవాడు) అని కూడా పిలుస్తారు. తిరుచ్చిలోని రత్నావతి అనే గర్భిణీస్త్రీ, పూంపుహార్‌లో వున్న తన తల్లిరాక కోసం ఎదురుచూస్తున్నదట. కావేరిలో ప్రవాహం ఉధృతంగా వుండడంవల్ల ఆమెతల్లి అక్కడికి చేరలేకపోయింది. రత్నావతికి పురిటి నొప్పులు ప్రారంభం కావడంతో సాక్షాత్తు శివుడే ఆమె తల్లిరూపంలోవచ్చి, రత్నావతి కాన్పుచూసి, ఒకవారం తరవాత ఆమె తల్లి వచ్చే వరకు అక్కడే ఉన్నాడట! తాయుమానవర్ అనే సుప్రసిద్ధ భక్తకవి కూడా ఉన్నాడు. ఆయన 'శివన్ సెయ్యుళ్' అనే భక్తిగీతాలను రచించాడు.

తిరుచ్చి నుంచి 7కి.మీ. దూరంలో కావేరి రెండుగా విడిపోయి ఆఖరి ద్వీపాన్ని ఏర్పరుస్తున్నది. దీనిని శ్రీరంగం లేదా అంత్యరంగం అని పిలుస్తారు. బహుశా క్రీ.శ.



శ్రీరంగనాథస్వామి ఆలయ బంగారు విమానం

3-4 శతాబ్దాలకాలంలోనే ఇక్కడి బ్రహ్మాండమైన శ్రీరంగనాథస్వామి దేవాలయం నిర్మించ బడింది. ఇక్కడి గర్భగృహంలో మహావిష్ణువు ఆదిశేషుని మీద పవళించిన భంగిమలో దర్శనమిస్తాడు. ఈ విగ్రహాన్ని శ్రీరాముడు తన పట్టాభిషేకాన్ని చూడవచ్చిన విభీషణుడికి కానుకగా ఇచ్చాడట. తిరుగు ప్రయాణంలో దానిని విభీషణుడు లంకకు తీసుకు వెళుతూ, ఈ ప్రాంతానికి వచ్చేసరికి అలిసిపోయి, విగ్రహాన్ని కింద పెట్టి ఆదమరిచి నిద్రపోయాడట. నిద్రలేచి విగ్రహాన్ని ఎత్తితే, అది కదిలి రాకుండా అలాగేస్థిరపడిపోయిందట. విభీషణుడు బావురు మని విలపించాడనీ, అతన్ని చోళరాజు ఓదార్చాడనీ స్థలపురాణం పేర్కొంటున్నది. శ్రీరంగనాథుడే, తాను పవిత్ర కావేరీ తీరంలో కొలువుంటాననీ, దక్షిణదిశగా వున్న లంకకేసి చూస్తూ పవళిస్తాననీ విభీషణుడికి మాట ఇచ్చాడట.


శ్రీరంగం ఆలయ రాజగోపురం

శ్రీరంగాన్ని 'తిరువరంగం' అనీ, 'కోయిల్' (దేవాలయం) అనీ అంటారు. దేవాలయం అంటే అది శ్రీరంగం ఆలయమే అని వైష్ణవుల అభిప్రాయం. పైగా, ఈ గుడి 6,31,000 చ.మీ. విస్తరించి భారత దేశంలోనే అతి పెద్ద దేవాలయం అనే ప్రశస్తిని గడించింది. గర్భగుడి చుట్టూ ఏడు ప్రాకారాలు ఉన్నాయి. వెలుపలి ప్రాకారం 844 మీ పొడవూ 742 మీ వెడల్పూ కలిగి ఉన్నది. వెలుపల వున్న మూడు ప్రాకారాలలో దుకాణాలూ, ఇళ్ళూ వున్నాయి. వేలాది ప్రజలతో అదే ఒక చిన్న పట్టణంలాగా కనిపిస్తుంది. 21 గోపురాలు ఉన్నాయి. వాటిలోని రాజగోపురం దక్షిణ భారతదేశంలోనే ఎత్తయిన గోపురం. దీని ఎత్తు 72 మీ॥. పదమూడు అంతస్తుల గోపుర పునర్నిర్మాణం నిజానికి 18వ శతాబ్దంలోనే ఆరంభమయింది. కాని ఆంగ్లో-ఫ్రెంచి యుద్ధాల కారణంగా అర్ధంతరంగా ఆగిపోయింది. అది 1987వసం॥లోనే పూర్తయింది.

ఆలయ గర్భగృహం 72మీ॥పొడవు, 54మీ॥ వెడల్పుతో చాలా చిన్నదిగా ఉన్నది. నూనె దీపాలు వెలిగిస్తారుగాని, అర్చకులు కర్పూర హారతి చూపినప్పుడే భక్తులు గర్భగృహంలోని మూల విగ్రహాన్ని దర్శించడానికి వీలవుతుంది!

విష్ణుభక్తిని ప్రచారం చేసిన భక్తకవులైన పన్నెండు మంది ఆళ్వార్లకు ఇక్కడ ఆలయాలు ఉన్నాయి. ఆళ్వార్లు రచించిన భక్తిగీతాలను – శ్రీ వైష్ణవమతాన్ని స్థాపించిన నాదముని అనే భక్తశిఖామణి సేకరించి, వాటికి 'నాలాయిర దివ్యప్రబంధం' అని పేరుపెట్టాడు. ఆయన ప్రధాన శిష్యుడూ, విశిష్టాద్వైత వేదాంత బోధకుడూ అయిన శ్రీరామానుజాచార్యులకు కూడా ఇక్కడ ఆలయం ఉన్నది.

నాలగవ ప్రాకారంలో హోయసాలుల శైలిలో నిర్మితమైన అందమైన శ్రీవేణుగోపాల కృష్ణమందిరం ఉన్నది. ఇక్కడ వున్న అద్భుత శిల్పాలు, ఈ ఆలయానికి దక్షిణ భారతదేశంలోని అందమైన దేవాలయాలలో ఒకటి అన్న విశిష్టతను సమకూరుస్తున్నాయి. ఇక్కడ కూడా ఆలయరథాన్ని నిలబెట్టివున్న వెయ్యిస్తంభాల మంటపం ఉన్నది. సుప్రసిద్ధ తమిళకవి కంబన్ పేరు మీదుగా ఇక్కడొక విశాల

మంటపం ఉన్నది. ఈ మంటపంలోనే ఆ మహాకవి రచించిన కంబ రామాయణ గ్రంథావిష్కరణ జరిగింది.



మధురనూ, తంజావూరునూ పాలించిన నాయక రాజుల కాలంలో శ్రీరంగనాథ ఆలయం మడులు, మాన్యాలు, ఆభరణాలు మొదలైన విశిష్ట కానుకలు పొందింది. ఆలయపునర్నిర్మాణంతో పాటు అదనంగా నూతన ఆలయాల నిర్మాణాలు కూడా జరిగాయి. ఆలయాభివృద్ధికి విశేషంగా కృషి చేసిన వారిలో అచ్యుతప్ప నాయకుడు ముఖ్యుడు. ఆయన తలపెట్టిన సత్కార్యాలకు గోవింద దీక్షితులు అనే దక్షుడైన ప్రధానమంత్రి తోడుగా నిలిచాడు. ఆయన కాలంలోనే విమానం బంగారు తొడుగుతో అలంకరించబడింది.

శ్రీరంగనాథుడి భక్తురాలైన ఒక ముస్లింరాణి ఆలయం కూడా ఇక్కడ ఉన్నది. ఆమెను తుళుక్కనాచ్చియార్ (బీబీనాంచారు) అని అంటారు. ప్రతి ఉదయం స్వామికి నివేదనంగా సమర్పించే రొట్టెలు, వెన్న, పాలు, పెసరపప్పులో కొంత భాగం ఈ ఆలయం ముందు ఉంచుతారు.

డిసెంబర్-జనవరి ప్రాంతంలో వచ్చే వైకుంఠ ఏకాదశి సందర్భంగా ఆలయంలో ఘనంగా ఉత్సవాలు జరుగుతాయి. ఈ సందర్భంగా ఉత్సవ విగ్రహాన్ని రథంలో వుంచి ఊరేగిస్తారు. స్వామి రథాన్ని వేలాది భక్తులు పోటీపడి లాగుతారు. మార్చి-ఏప్రిల్ నెలలమధ్య మళ్ళీ ఒకసారి ఆలయంలోని ఉత్సవమూర్తిని తిరుచ్చి సమీపంలోని ఉరైయూర్ లోని నాచ్చియార్ ఆలయానికి కోలాహలంగా తీసుకువెళతారు. ఉరైయూర్ చోళుల పూర్వ రాజధాని. తొమ్మిది రోజుల పాటు జరిగే ఉత్సవంలో ఇక్కడ దేవుడు తన దేవేరితో కొలు వుంటాడు. ఇందులో ఒక భాగంగా భార్యా భర్తల మధ్య ప్రణయ కలహాలను రెండు బృందాల అర్చకులు అభినయిస్తారు. తమిళ సంవత్సరాది రోజున ఆలయ ధనాగార రక్షకుడు ప్రత్యేక దుస్తులతో దేవుడి ముందు నిలబడి - ఆలయానికి సంబంధించిన ఏ ఏ గ్రామాలను, ఏ ఏ మాన్యాలను ఎవరెవకి కౌలుకు ఇచ్చిందీ (ఊహాత్మకంగా) వివరిస్తాడు. అంటే-ఇప్పటికీ, మరెప్పటికీ ఆస్తులన్నిటికీ నిజమైన అధిపతి శ్రీరంగనాథుడే అని చెప్పడం అన్నమాట!



వెయ్యిస్తంభాల మంటపంలోని అందమైన శిల్పాలు.

కావేరీనది ఈ ద్వీపాన్ని చుట్టుముట్టినప్పటికీ రెండు శాఖలూ శ్రీరంగం చివర మళ్ళీ ఒకటిగా కలవడం లేదు. ఒకశాఖ విడిగా ఉత్తర దిశగా వెళ్ళి, ప్రధాన ఉపనది కొళ్ళిడంగా రూపొందు తుంది. అది విడిపోయేచోట 1600 సంవత్సరాలకు పూర్వం ఈ ప్రాంతాన్ని పాలించిన కరికాలుడనే చోళరాజు 'కల్లణై' అనే బ్రహ్మాండమైన రాతి ఆనకట్టను నిర్మించాడు.



# శివుడి వివాహం

శరత్‌చంద్రిక దేశపురాజు చంద్రసేనుడికి చాలాకాలం సంతానం కలగలేదు. మహారాణి చూడామణిదేవి ఎన్నోపూజలుచేసింది. రాజదంపతులు అరణ్యానికి వెళ్ళి, మునులకు శుశ్రూషలు చేశారు. చివరకు దైవం కరుణించి మహారాణి గర్భంధరించి, పండంటి ఆడబిడ్డను ప్రసవించింది.

రాజదంపతులు తమ కుమార్తెకు మధుమిత్ర అని నామకరణం చేశారు. మధుమిత్రకు అయిదేళ్ళ ప్రాయం వచ్చింది. అంతఃపురంలో వుండే దాసీల్లో శాంతమణి అనే వృద్ధ దాసి అంటే మధుమిత్రకు ఎంతో యిష్టం. శాంతమణికి్కూడా యువరాణి అంటే పంచప్రాణాలు.

మధుమిత్రకు తన ఈడువారైన స్నేహితులెవరూలేరు. అందువల్ల, ఎప్పుడూ దిగులుగావుండేది. శాంతమణి తరచూ మధుమిత్రకు, తన మనవడు శివుడి గురించి చెబుతూంటే, మధుమిత్ర ఎంతో మురిపంగా వినేది. ఒకరోజు, మధుమిత్ర, శాంతమణితో, "రేపు వచ్చేటప్పుడు శివుణ్ణి నీవెంట తీసుకురా!" అని చెప్పింది.

మహారాజు ఏమంటాడో అన్న భయం మనసులోవున్నా, శాంతమణి, యువరాణి కోరికను కాదనలేక శివుణ్ణి అంతఃపురానికి తెచ్చింది.

ఆ తర్వాత శివుడు తరచూ అంతఃపురానికి వచ్చేవాడు. మధుమిత్ర, శివుడి మీద ఇష్టం పెంచుకున్నది.

క్రమంగా మధుమిత్రకు యుక్తవయసు వచ్చింది. అంతటితో శివుడు అంతఃపురానికి రావడానికి అభ్యంతరం చెప్పారు. ఇందుకు శివుడు, మధుమిత్ర చాలా దిగులు పడ్డారు. రాజదంపతులు కుమార్తెకు పెళ్ళి సంబంధాలు చూడసాగారు.

ఇది తెలిసిన మధుమిత్ర, శాంతమణితో "నేను పెళ్ళిచేసుకుంటే శివుడినే చేసుకుంటాను. లేకుంటే ప్రాణాలయినా వదులు

ఎన్.శివనాగేశ్వరరావు



తాను. అంతే గాని మరొకరిని వివాహ మాడను," అని చెప్పింది.

ఇది విన్న శాంతమణి భయంతో వణికి పోయింది. ఆమె, యువరాణికి తనమన వడంటే యిష్టమని తెలుసుగాని, అది పెళ్ళా డేంతయిష్టమని ఊహించలేక పోయింది.

ఆమె, మధుమతితో, "యువరాణీ! మిమ్మల్ని వివాహం చేసుకోగలిగేంత అర్హత శివుడికి లేదు," అని చెప్పింది.

"మంచితనానికి మించిన అర్హత ఏముంది? అతణ్ణి తప్పవేరేఎవర్నీ వివాహ మాడను," అన్నది మధుమిత్ర.

"అయితే, నీ తల్లి దండ్రులకు ప్రస్తుతా నికి పెళ్ళిచేసుకోనని చెప్పు. నేను ఏదో ఒక ఉపాయం ఆలోచిస్తాను," అన్నది శాంత మణి.

శాంతమణి నుంచి సంగతి విన్నశివుడు ఆనందంతో పొంగిపోయాడు.

శాంతమణి, వాడితో, "ఇప్పుడు, రాకుమా ర్తెను వివాహమాడే అర్హత సంపాయించాలి. ఒట్టినే సంతోషపడిలాభంలేదు," అన్నది.

ఆ మర్నాడే శివుడు ప్రయాణమై అడవి చేరాడు. ఒకచోట, విచిత్రమైన వాయిద్యం పట్టుకుని ఒక మనిషి చెట్టుకింద కూర్చుని కనిపించాడు. అతడు చాలాదిగులుగా వున్నాడు. శివుడు, అతణ్ణి పలకరించి, "చాలా కష్టాల్లో వున్నట్టున్నావు. ఎవరు నువ్వు?" అని అడిగాడు. "నాపేరు రాగం. నేనొక గురువుకు చాలాకాలం సేవలు చేశాను. ఆయన నాకీవాయిద్యం యిచ్చి సాగనంపాడు. దీన్ని వాయిస్తే వికృతమైన రాగాలు వినిపించి, ఎదుటివాడికి పట్ట రాని శిరోవేదన కలుగుతుంది. విన్న ప్రతి ఒక్కరూ నన్ను తన్నితగిలేశారు. ఇదెందుకు నాకుపనికివస్తుంది!"అంటూవాపోయాడు.

ఇది విన్న శివుడు, "బాధపడకు! తెలివి తేటలు ఉపయోగిస్తే, దీనితో మనం లాభ పడవచ్చు. నా వెంటరా!" అన్నాడు.

శివుడు, రాగంతో కలిసి కొంత దూరం వెళ్ళేసరికి, అక్కడొక వ్యక్తి కనిపించాడు. వాడు శిరస్సును మట్టిలో దూర్చి శీర్షా సనంలో వున్నాడు. శివుడు, వాడు తలను బయటికి తీసేంత వరకూ ఓపిగ్గా వుండి, వాడు తలబయట పెట్టగానే, "ఎవరు నువ్వు? ఏంచేస్తున్నావు?" అని అడిగాడు.

"నూరడుగులలోతున బంగారుగను లున్నాయి. వాటిని నేనొక్కణ్ణే తవ్వి తీసుకో

లేను గదా!" అంటూ నేత్రం బాధపడ సాగాడు.

"బాధపడకు. అసలు నీకీ శక్తి ఎలా వచ్చింది?" అని అడిగాడు శివుడు.

"ఒక చెట్టు కింద తపస్సు చేసుకుం టున్న ముని మీద పులి దూకబోయింది. నేను దాన్ని బాకుతో పొడిచి చంపేశాను. ముని సంతోషించి, నాకీ శక్తిని ప్రసాదించాడు. దీనితో ఎలాబాగుపడాలో అర్థంకావడం లేదు," అంటూనేత్రం కన్నీళ్ళ పర్యంతమై పోయాడు.

"విచారించకు. నాతో రా!" అన్నాడు శివుడు.

శివుడు రాగం, నేత్రంతో కలిసి వెళుతూంటే, మార్గమధ్యాన ఒక విలుకాడు కనిపించాడు. అతడి చేతిలోని ధనుస్సు అతిచిన్నదిగా వుండడం గమనించిన శివుడు, "ఈధనుస్సుతో పిట్టప్రాణం కూడా తీయలేవేమో!" అంటూ చిన్నగానవ్వాడు.

అందుకు విలుకాడు, "ఈధనుస్సు శక్తి అమోఘం! అవతలి వాడు దుష్టుడూ, మనకు హాని తలపెట్టిన వాడైతే - వాడెంత బలవంతుడైనా సరే, ఈ ధనుస్సు హతమారుస్తుంది. మనం చేయవలసిందల్లా, మనసులో వాడెక్కడతగలాలో తలచుకుని గురిచేసి వదలడమే!" అన్నాడు.

"నీ పేరేమిటి? ఇంత మహత్తుగల ధనుస్సును ఎలా సంపాయించావు?" అని అడిగాడు శివుడు.

"నాపేరు బలం. ఒక దుష్టమాంత్రికుడు, అమాయకులను మోసగించి దేవికి



బలియిస్తూంటే చూసి, వాడినే మోసగించి దేవికి బలియిచ్చాను. దేవి సంతుష్టురాలై, నాకీ ధనుస్సును ప్రసాదించింది. అయితే, దీన్ని ఉపయోగించి ఎలా లాభపడాలో తెలియడంలేదు," అని బాధపడ్డాడు బలం.

"బాధపడకు. నువ్వు కూడా మాతో రా!" అని శివుడు రాగం, నేత్రం, బలాలతో మరికొంత దూరం ముందుకు పోయాడు.

అక్కడ వాళ్ళకు కఠోరకర్ణుడనే రాక్షసుడు కనిపించాడు. వాడికి అందిన జంతువులనే గాక మనుషులను తినడం కూడా. మహదానందం. వాడు, శివుణ్ణీ వాడివెంట వున్న వాళ్ళనూ చూసి భీకరంగా అరిచాడు. బలం వాడికేసి కోపంగా చూస్తూ శివుడితో, "నావిల్లుతో వీణ్ణి ఇప్పుడే చంపేస్తాను!" అన్నాడు.



శివుడు, వాణ్ణి ఆగమని ఏదోచెప్ప బోయేంతలో, రాక్షసుడు పెద్దపెద్ద అంగలతో వాళ్ళను సమీపించాడు. శివుడు, రాగం చేతిలోని వాయిద్యాన్ని లాక్కుని వాయించ సాగాడు. అదివింటూనే రాక్షసుడికి భయంకరమైన శిరోవేదన కలిగింది. వాడు చేతులెత్తి, "తక్షణం ఆపు! లేకపోతే తలపగిలిపోయేలా వుంది!" అన్నాడు.

శివుడు వాయిద్యం ఆపకుండా, "ఒరే, నేను చెప్పిన పని చేయాలి!" అన్నాడు పళ్ళుకొరుకుతూ.

"మహా ప్రసాదం, ప్రభో! అలాగే, అలాగే," అంటూరాక్షసుడు కూలబడ్డాడు.

శివుడు, రాక్షసుణ్ణి తనతోపాటు తీసుకుపోయి, నేత్రం చెప్పినచోట తవ్వి బంగారం బయటికి తీయమన్నాడు. వాడు తన రెక్కల బలంతో తవ్వి క్షణాలమీద బంగారాన్ని బయటికి తీశాడు.

శివుడు, రాక్షసుణ్ణి ఆ ప్రాంతాలు వదిలి అడవిలో మరింతదూరప్రాంతాలకు పొమ్మని ఆజ్ఞాపించి, దొరికిన బంగారాన్ని రాజభవనానికి తీసుకుపోయి, రాజుకు కానుకగా యిచ్చి, "మహారాజా! తమకు అవసరమైనప్పుడు ఇంతకంటే ఎక్కువ బంగారాన్ని కానుకగా సమర్పించగలను. ఈ ముగ్గురూ నాప్రాణమిత్రులు!" అని చెప్పాడు.

ఆ తరువాత శివుడు, రాజభవనం చేరి రాకుమారి మధుమిత్రను కలుసుకుని జరిగినదంతా చెప్పాడు. ఆమెకు శివుడి తెలివితేటలు చూశాక, అతడు తనను తప్పక పెళ్ళాడగలడన్న నమ్మకం కలిగింది.

ఈ సమయంలో, పులిమీద పుట్రలా పొరుగు రాజు శ్రీచందుడినుంచి, చంద్రసేనుడికి ఒక లేఖ వచ్చింది. దాని సారాంశం: తనకొడుక్కు మధుమిత్రనిచ్చి తక్షణం వివాహం చేయకపోతే–వంద ఏనుగులతో, ఐదువేల అశ్వికులతో, యాభైవేల కాలిభటులతో బయలుదేరి రాజ్యంమీద దాడి చేస్తానని! శ్రీచందుడి సైనికబలంతో పోల్చితే, తన సైనికబలం కొరగానిదని ఎరిగిన రాజుచంద్రసేనుడు, ఏమిచేయడమా అన్న దిగులుతో మంచంఎక్కాడు.

రాకుమారి మధుమిత్ర తండ్రికి ధైర్యం చెప్పి, శివుడి శక్తి సామార్థ్యాలగురించి వివరించింది. అంతావిన్న చంద్రసేనుడు, "ఇంతకూ ఈ శివుడికి తెలివితేటలు తప్ప రాజ్యమంటూ లేదు. రాజ్యంలేనివాడితో

రాజకుమార్తెల వివాహం జరిగినట్టు ఏనాడైనా విన్నావా?" అని ప్రశ్నించాడు.

ఆ సమయంలో అక్కడికి వస్తూ, ఆయన మాటలు విన్న శివుడు, "మహా రాజా, అనుమతించండి! అతిక్రూరుడైన ఆ శ్రీచందుడు తన ఏనుగులబలం, గుర్రాలధాటీ, సైనికులబలపరాక్రమాల పేరు చెప్పి, ఈసరికే కొన్ని చిన్న రాజ్యాలను ఆక్రమించుకున్నాడు. ఇప్పుడునేన తణ్ణీ హతమార్చి, అతడి రాజ్యాన్ని ఆక్రమించి రాజు కాగలను!" అన్నాడు.

"అలాగా! ఐతే, రాకుమారి మధుమిత్ర రాజైననీకు, రాణికాబోతున్నది!" అన్నాడు చంద్రసేనుడు ఉత్సాహంగా.

ఆ వెంటనే శివుడు, చంద్రసేనుడి కొద్ది పాటి సైన్యాన్ని వెంటబెట్టుకుని, మిత్రుడు బలంనుంచి మహాశక్తివంతమైన ధనుస్సుతో, దాడి వస్తున్న శ్రీచందుడి సైన్యానికి ఎదురువెళ్ళాడు.

శివుడి చేతిలో వున్న చిన్న ధనుస్సును చూసి శ్రీచందుడు ఫక్కున నవ్వి, "ఒరే, మూర్ఖుడా! ఇది ఘోరభీషణసంగ్రామం; బాలుర ఆకతాయి ఆటకాదు. నావెన్నంటి వస్తున్న గజ, తురగ, పదాతి సైన్యాన్ని చూశావా?" అన్నాడు.

శివుడు మారుపలక్కుండా, మనసులో దేవిని ధ్యానించి, బాణాన్ని ధనుస్సుకు సంధించి, పరమదుర్మార్గుడైన శ్రీచందుడి గుండెలను తాకాలంటూ బాణాన్ని వదిలాడు. బాణం సూటిగాపోయి శ్రీచందుడి గుండెల్ని చీల్చింది. శ్రీచందుడు ఒక చావుకేక పెట్టి, ఏనుగు మీదినుంచి జారినేలమీద కుప్పలా కూలి పోయాడు. ఇది చూసి అతడి సైన్యం చెల్లాచెదురుగా పారిపోయింది. శివుడి వెనకవున్న సైన్యం, "శివసేన మహారాజుకూ, జై!" అంటూ జయజయ ధ్వానాలు చేసింది.

శివుడి ధైర్యసాహసాలూ, తెలివితేటలూ చూసిన రాజు చంద్రసేనుడు, నెలతిరక్కుండానే వాడికి తనకుమార్తె మధుమిత్ర నిచ్చి వైభవంగా వివాహం జరిపించాడు.

ఆ తర్వాత శివుడు శివసేనుడి పేరుతో, మరణించిన శ్రీచందుడి రాజ్యానికి రాజై, తనమిత్రులైన రాగం, నేత్రం, బలం- ముగ్గురికీ మంత్రిపదవులిచ్చి, చాలాకాలం ప్రజారంజకంగా రాజ్యపాలన చేశాడు.



# స్పజనాత్మక పోటీలు

రూ 500/-లు బహుమతి పొందిన జనవరినెల సామెత (అందని ద్రాక్షపళ్ళు పుల్లన) కథ

# కుదరని పెళ్ళిసంబంధం

శ్రీపురం గ్రామస్థుడైన పరంధామయ్యకు ఒక్కగానొక్క కూతురు శారద. ఆమెకు యుక్త వయస్సురాగానే పరంధామయ్య పెళ్ళి ప్రయత్నాలు ప్రారంభించాడు. రాజధానిలో ఉంటూన్న అతని బాల్య స్నేహితుడు కోదండానికి విదేశంలో పని చేస్తున్న పెళ్ళికెదిగిన కొడుకున్నాడని ఆయనకు తెలిసింది. మంచిరోజు చూసుకుని రాజధానికి ప్రయాణమయ్యాడు.

పరంధామయ్యను చూడగానే, కోదండం చాలా సంబరపడ్డాడు. ఆప్యాయంగా పలకరించి కుటుంబసభ్యులందరినీ పరిచయంచేశాడు. భోజనాలయ్యాక, పరంధామయ్య పాలకొచ్చి ముంతదాచుకోవడం ఎందుకని అసలువిషయంచెప్పాడు. అంతావిన్న కోదండం, "అబ్బాయి విదేశంలో ఉన్నాడు. ఎప్పుడువచ్చేదీ తెలియదు. మీ ఊరు మేమువచ్చి, శారదను చూసి, వివరాలు మా అబ్బాయికి తెలియజేస్తాము. ఆ తరవాత అతడి ఇష్టం," అన్నాడు.

వారం తిరక్కుండానే కోదండం, ఆయన భార్యా శ్రీపురం వచ్చి శారదను చూసి, జాతకం తదితర వివరాలు సేకరించుకుని వెళ్ళారు. కోదండం కుటుంబం, మంచి పేరు సంప్రదాయం కలిగిన కుటుంబం. పిల్లలు బుద్ధిమంతులు. తల్లిదండ్రుల మాట జవదాటని వారు, అని కోదండాన్ని ఎరిగిన వారంటున్నారు. ఏలోటూలేని కుటుంబంగనక, కోదండం తన కూతురిని కోడలుగా చేసుకుంటే బావుంటుందనుకున్నాడు పరంధామయ్య.

అయితే, పల్లెటూరిపిల్ల శారద, కోదండం దంపతులకు నచ్చలేదు. నెలతిరక్కుండానే కోదండం దగ్గరనుంచి ఉత్తరం వచ్చింది, జాతకాలు కుదరలేదని.

పరంధామయ్య ఉత్తరం చదువుకుని పైకి ఏమాత్రం విచారం కనపరచకుండా, ఆనందం నటిస్తూ, "హమ్మయ్య! నా ఒక్క సమస్య తీరిపోయింది!" అన్నాడు.

"అంత సంబరపడేవిషయం, అందులోఏముంది?" అని అడిగింది భార్య ఆశ్చర్యంగా.

"కోదండం నా చిన్ననాటి స్నేహితుడు. ఆయన స్వభావం నాకు తెలుసు. ఆయన కొడుకు ఎలాంటివాడో ఎలాతెలుస్తుంది? జనని, జన్మభూమి స్వర్గంకంటే గొప్పవని అంటారు. పొట్టకూటి కోసం జన్మభూమినే వదిలిన వాడు భార్యాపిల్లలను ఎలా చూసుకుంటాడో చెప్పడం కష్టం. విదేశంలో వుండడానికి అధికార పత్రాలు రావడానికి రెండుసంవత్సరాలు పడుతుందట! పిల్లలకు పెళ్ళి చేసేది తిరిగి మన నెత్తిన పెట్టుకోవడానికా? అమ్మాయి విదేశంలోవుంటే దాని కష్టసుఖాలుచూడటం మనకు సాధ్యమవుతుందా? కోదండం తన కొడుక్కి మనమ్మాయిని చేసుకుంటానంటే ఎలా కాదని చెప్పటమా అని సతమతమవుతూంటే, ఈ ఉత్తరం వచ్చింది. నా సమస్య తీరిపోయింది," అన్నాడు పరంధామయ్య నవ్వుతూ.

అందని ద్రాక్షపళ్ళు పుల్లన!

— కె.ఎ.ఎన్. తల్పశాయి

51. కురుక్షేత్రం

# మహాభారతం

పాండవుల సేనలు కురుక్షేత్రం చేరగానే సైనిక శిబిరం నిర్మించటానికి మంచి, అనుకూల ప్రదేశం చూశారు. దానికి తృణ, కాష్ఠ, జల సమృద్ధి ఉన్నది. సమీపంలో శ్మశానాలు గాని, దేవాలయాలు గాని, ఋషుల ఆశ్రమాలు గాని లేవు. కృష్ణార్జునులు అనేక మంది రాజులను వెంట బెట్టుకుని, రథం మీద శిబిరం నిర్మించే ప్రదేశమంతా కలయతిరిగి, అక్కడక్కడా గుంపులుగా చేరి ఉన్న కౌరవ సైనికులను దూరంగా తరిమేశారు.

ధృష్టద్యుమ్నుడూ, సాత్యకీ, యుయుధానుడూ, శిబిరాల నిర్మాణానికి కొలతలు పెట్టించారు. హిరణ్వతీనదీ తీరాన పాండవ శిబిరాలు లేచాయి. వాటిచుట్టూ కృష్ణుడు చాలా పెద్ద అగడ్త తవ్వించాడు. పాండవ శిబిరాల వంటివే మిగిలిన రాజులందరికీ ఏర్పడ్డాయి. అన్ని శిబిరాలలోనూ సమృద్ధిగా భోజనానికీ, తాగటానికీ ఏర్పాట్లు జరిగాయి. సేన వెంట అనేక వేలమంది శిల్పులూ, వైద్యులూ ఉన్నారు. కవచాలూ, ఆయుధాలూ, తేనే, నెయ్యీ, ధూపసామగ్రి మొదలైనవి కొండలంత రాసులు పోసి ఉన్నాయి. ధర్మరాజు ప్రతి శిబిరానికీ వెళ్ళి, అన్ని సదుపాయాలూ సరిగా అమరినదీ, లేనిదీ స్వయంగా చూశాడు.

కృష్ణుడు హస్తినాపురం నుంచి బయలుదేరగానే దుర్యోధనుడు కర్ణ, శకుని, దుశ్శాసనులను పిలిపించి, "నాకూ, పాండవులకూ యుద్ధం జరగటమే కృష్ణుడు కోరేది. అతను వారిని ఎలాగూ రెచ్చగొట్టుతాడు. మనం పెద్ద ఎత్తున యుద్ధ సన్నాహం చెయ్యవలసి ఉన్నది. అందుచేత మీరు చురుకుగా యుద్ధయత్నాలు చేసి, కురు





క్షేత్రంలో మన శిబిరాలు నిర్మించండి. వేల కొద్దీ శిబిరాలు నిర్మాణం కావాలి. మనకు ఆహారం వచ్చే మార్గాలు శత్రువుకు స్వాధీనం కారాదు. వాటికి బలమైన రక్షలు కావాలి. శిబిరాలలో వస్తుసమృద్ధీ, ఆయుధసమృద్ధీ, ఉండాలి. లక్షలకొద్దీ పతాకాలూ, ధ్వజాలూ తయారుకావాలి. శిబిరాలమధ్యమార్గాలు చక్కగా చదునుచేయించండి. రేపే సైన్యం కదలి శిబిరాలు చేరాలి," అని చెప్పాడు.

కౌరవ శిబిరాలు సిద్ధమయ్యాయి. హస్తినాపురమంతా సైనిక సన్నాహపు సందడితో నిండిపోయింది. కౌరవ సేనలు సైనిక శిబిరాలు చేరుకున్నాయి.

తీరా తన దాయాదులను చంపటానికి ప్రయత్నాలన్నీ చేసిన మీదట ధర్మరాజును ధర్మసందేహాలు బాధించాయి. ఆయన కృష్ణుడితో, "కృష్ణా, మనం చేయబోయేది ధర్మవిరుద్ధం కాదు గద?" అన్నాడు. దానికి కృష్ణుడు, "మన రాజ్యభాగం ఇవ్వకపోతే మనం సంధి చేసుకోలేంగదా? అలాటప్పుడు యుద్ధం చెయ్యక గత్యంతరం ఏమున్నది?" అన్నాడు.

కృష్ణుడు ఇలా అన్నమీదట ధర్మరాజు యుద్ధప్రకటన చేశాడు. సేనలలో ఉత్సాహమూ, సంచలనమూ బయలుదేరింది.

తరవాత ధర్మరాజు భీమార్జునులతో, "వంశనాశం జరగగూడదని మనం వనవాసమూ, అజ్ఞాత వాసమూ చేశాం, పడరాని కష్టాలు పడ్డాం. కాని ఆ వంశ నాశనం ఇప్పుడు దాపరించనే దాపరించింది. వంశ రక్షణ కోసం మనం చేసిన ప్రయత్నం ఫలించలేదు. కాని వంశనాశనానికి మనం చేసే ప్రయత్నం ఫలించబోతున్నది. మన గురువులనూ, వృద్ధులనూ చంపి మనం ఎలాటి విజయం సంపాదిస్తామో నాకు అర్థం కాలేదు," అని దిగులుగా అన్నాడు.

"మన తల్లీ, విదురుడూ చెప్పిన దాని కన్న మనకు వేరే ధర్మం ఏమున్నది? యుద్ధం జరిగే తీరాలి," అన్నారు భీమార్జునులు. అంతేనన్నాడు కృష్ణుడు.

మర్నాడు దుర్యోధనుడు తన పక్షాన వచ్చిన పదకొండు అక్షౌహిణుల సేననూ, వాటి బలాబలాలను బట్టి విభజించాడు. ఉత్తమమైన సేనలు ముందూ, మధ్యమమైనవి మధ్యలోనూ, బలహీనమైనవి వెనుకనూ ఉండేటట్టు ఏర్పాటు చేశాడు. విరిగి పోయిన రథాలను మరమ్మతు చెయ్యటానికి కర్రలు లక్షల సంఖ్యలో సిద్ధం చేయబడ్డాయి. రథాలన్నిటిలోనూ



అమ్ములపొదులు అమర్చబడ్డాయి. రకరకాల ఆయుధాలూ, తైలాలూ, తదితర వస్తువులూ సేకరించబడ్డాయి.

దుర్యోధనుడు తన పదకొండు అక్షౌహిణులకూ పదకొండు మంది నాయకులను నియమించాడు. వారు: కృపుడూ, ద్రోణుడూ, శల్యుడూ, సైంధవుడూ, సుదక్షిణుడూ, కృతవర్మా, అశ్వత్థామా, కర్ణుడూ, భూరిశ్రవసుడూ, శకునీ, బాహ్లికుడూనూ.

నిండు సభలో ఇలా అక్షౌహిణీపతులను నియమించిన అనంతరం దుర్యోధనుడు భీష్ముడి కేసి తిరిగి చేతులు జోడించి, "మహాత్మా, ఎంత పెద్ద సేన అయినా తగిన నాయకుడు లేకపోతే చీమలపుట్టలాగా చెదిరిపోతుంది. వేరు వేరు సేనాపతుల మధ్య పోటీ ఉంటుంది గాని, సామరస్యం ఉండదు. పూర్వం హైహయ క్షత్రియుల మీద బ్రాహ్మణులు ధ్వజమెత్తి యుద్ధానికి తలపడ్డారు. వారివెంట వైశ్య, శూద్రవర్ణాల వారు కూడా హైహయులతో యుద్ధం చేశారు. కాని ఎన్ని యుద్ధాలు జరిగినా అల్ప సంఖ్యలో ఉన్న హైహయులకే విజయంలభిస్తూ వచ్చింది. దానికి కారణం ఏమంటే హైహయులకు సమర్థుడైన నాయకుడు ఒకడే ఉన్నాడు. మూడు వర్ణాల సేన బహునాయకమైనది. ఈ రహస్యం తెలుసుకుని బ్రాహ్మణులు తమలో ఒక సమర్థుడికి నాయకత్వం ఇచ్చి, హైహయుల మీద గెలిచారు. నువ్వు నీతిలో శుక్రుడంత వాడివి. మా మేలు కోరినవాడివి. ధర్మంతప్పనివాడివి.ఓటమిఎరగనివాడివి. అందుచేత నువ్వు నా సేనలన్నిటికీ అధిపతివిగా ఉండి, ఇంద్రుడు దేవతలను కాపాడినట్టు మమ్మల్ని కాపాడు," అన్నాడు.

దుర్యోధనుడి బలాలకు సర్వ సేనాపతిగా ఉండటానికి భీష్ముడు రెండు నిబంధనలు తెలిపాడు: తాను పాండవులలో ఎవరినీ చంపడు; కర్ణుడూ, తానూ ఒకేసారి యుద్ధంచెయ్యటం పొసగదు, ఎందుకంటే కర్ణుడికి తానంటే అమితమైన మత్సరం; అందుచేత ముందు కర్ణుడైనా యుద్ధరంగంలోకి రావాలి, లేదా తానైనా రావాలి.

భీష్ముడు ఇలా అనటం విని కర్ణుడు దుర్యోధనుడితో, "రాజా, భీష్ముడు జీవించి ఉండగా నేను యుద్ధరంగంలో అడుగు పెట్టను," అని మాట ఇచ్చాడు.

తరవాత దుర్యోధనుడు శాస్త్రోక్తంగా భీష్ముణ్ణి సర్వ సేనాపతిగా అభిషేకించాడు.

తరవాత అతనూ, అతని తమ్ములతోపాటు, సేనలూ కురుక్షేత్రానికి తరలివెళ్ళాయి.

ఇంక యుద్ధం ఆరంభం కాబోతున్నదని విని బలరాముడు, కొందరు యాదవ వీరులను వెంటబెట్టుకుని, పాండవ శిబిరానికి వచ్చాడు. అందరు రాజులూ, పాండవులూ, కృష్ణుడూ లేచి నిలబడి ఆయనను గౌరవించారు. బలరాముడు పెద్దలైన విరాటద్రుపదులకు నమస్కారం చేసి కూర్చుని, ఇలా అన్నాడు:

"మహా భయంకరమైన యుద్ధమూ, జనక్షయమూ జరగబోతున్నది. ఇది తప్పేట్టు లేదు. ఈ యుద్ధం నుంచి మీరందరూ ప్రాణాలతోనూ, వికలాంగులు కాకుండానూ బయటపడగా చూస్తానని ఆశిస్తున్నాను. మనకు పాండవుల వంటి బంధువులే కౌరవులూ అనీ, ఇరు పక్షాలనూ సమంగా చూడమనీ నేను కృష్ణుడికి ఎన్నోసార్లు చెప్పాను. కాని అతనికి అర్జునుడంటే ప్రాణం. పాండవులంటే అభిమానం. నా మాట విన్నాడు కాడు. భీమ దుర్యోధనులిద్దరూ నాకు ప్రియమైన శిష్యులే, ఇద్దరూ నా దగ్గర గదాయుద్ధంలో ఆరితేరిన వాళ్ళే. యుద్ధంలో కృష్ణుడి సహాయంతో పాండవులు గెలిచి తీరుతారు. కౌరవుల వినాశం నేను చూడలేను. సరస్వతీ నదీ ప్రాంతాన గల పుణ్యక్షేత్రాలు సేవించబోతున్నాను."

ఇలా చెప్పి బలరాముడు వెళ్ళిపోయాడు. అదే సమయంలో రుక్మిణి అన్న అయిన రుక్మి ఒక అక్షౌహిణి సేనతో పాండవుల వద్దకు వచ్చి, ధర్మరాజు చేత అతిథి సత్కారాలు పొంది, సభలో అందరూ



వింటూండగా అర్జునుడితో, "అర్జునా, ఈ యుద్ధంలో నీకు సహాయం కావాలంటే చెప్పు, నేను నీకు ఎలాటి భయమూ కలగకుండా శత్రువును మట్టుపెట్టేస్తాను. పరాక్రమంలో నాకు ఎవరూ చాలరు. ఈ రాజులందరూ ఇక్కడి నుంచి కదిలే పనిలేదు. ఆ కృపుణ్ణీ, ద్రోణుణ్ణీ నేనే చంపేసి, మీ రాజ్యం మీకిప్పిస్తాను," అన్నాడు.

అర్జునుడు అందరి ముఖాలూ చూసి నవ్వుతూ, "వీరాగ్రేసరా, నేను భయపడే సమస్యలేదు. ఎవరి సహాయమూ లేకుండానే దుర్యోధనుణ్ణి గంధర్వుల నుంచి విడిపించాను; ఖాండవ దహనం చేయించాను; విరాటుడి గోవులను కౌరవ సేనల నుంచి మళ్ళించాను. మీరు సహాయం చేయదలిస్తే మరెవరికైనా సహాయం చెయ్యండి. లేదా, మా వెంట ఉండి నేను



ఎలాయుద్ధం చేస్తానో చూడండి," అన్నాడు. అప్పుడు రుక్మి తన పెద్దసేనను వెంట బెట్టుకుని దుర్యోధనుడి దగ్గరికి వెళ్ళి, ఇలాగే ప్రగల్భాలాడాడు. దుర్యోధనుడు కూడా రుక్మి సహాయం నిరాకరించాడు. రుక్మి తన దేశానికి తిరిగివెళ్ళాడు.

ఈ విధంగా కురుక్షేత్రంలో జరిగిన యుద్ధంలో చేరనివారు బలరాముడూ, రుక్మి మాత్రమే. మిగిలిన వారంతా ఏదో ఒక పక్షాన యుద్ధం చేశారు.

హిరణ్వతీ నదీ తీరాన శిబిరంలో ఉన్న పాండవుల వద్దకు దుర్యోధనుడు శకుని కొడుకైన ఉలూకుణ్ణి దూతగా పంపి, ధర్మ రాజుకూ, కృష్ణుడికీ, భీమార్జునులకూ, నకుల సహదేవులకూ ఇలా పొగరుతో కూడిన సందేశం పంపాడు: "ధర్మ రాజా, నువ్వు రుద్రాక్ష పిల్లివి. నీది పిల్లిజపం. లోకాన్ని వంచించటానికి నువ్వు వేదాలనూ, సహనాన్నీ అవలంబించావు. ఇప్పుడైనా క్షాత్రధర్మం అవలంబించి యుద్ధం చెయ్యి. నువ్వు అయిదు గ్రామాలే అడిగితే బుద్ధిపూర్వకంగానే నేను నిరాకరించి, నిన్ను యుద్ధానికి పురికొల్పాను.

"కృష్ణా, నువ్వు మా సభలో ఏదో గారడీ చేసి ఒకరూపం చూపించావు. అదేరూపంతో యుద్ధరంగంలో నా ఎదటపడు. యోధులు ఇలాటి మాయలకు ఆగ్రహిస్తారు గాని భయపడరు. యుద్ధంలో పాండవులను గెలిపించి, వారికి రాజ్యం ఇప్పిస్తానని ప్రగల్భాలాడావు. ఆమాటలు నిలబెట్టుకో.

"భీమా, నువ్వు తిండిపోతువు, యుద్ధానికి పనికిరావు. నా ప్రతాపం చేత నిన్ను నేను విరాటుడికి వంటలవాణ్ణి చేశాను. ధృతరాష్ట్రుడి కొడుకుల నందరినీ యుద్ధరంగంలో గెలుస్తానని ప్రతిజ్ఞలు పలికావు. ఆ ప్రతిజ్ఞలు నిలబెట్టు."

ఇదే ధోరణిలో దుర్యోధనుడు అర్జున నకుల సహదేవులకూ, ధృష్టద్యుమ్నుడికీ సందేశాలు పంపాడు. వాటిని ఉలూకుడు తెచ్చి పాండవ శిబిరంలో అందించాడు. దుర్యోధనుడు ఊహించినట్టే అందరూ ఆగ్రహావేశం చెందారు. వారు ఉలూకుడితో, "దుర్యోధనుడు మమ్మల్ని యుద్ధానికి రెచ్చగొట్టుతున్నాడు. అతని కోరిక తీరుతుందని చెప్పు," అన్నారు.

ఉలూకుణ్ణి పంపేసి ధర్మరాజూ, ధృష్టద్యుమ్నుడూ తమ సేనలను యుద్ధరంగానికి తరలించారు. ధృష్టద్యుమ్నుడు తమ వీరులకు కౌరవవీరులను ఈ విధంగా

ప్రతియోధులని నిర్ణయించాడు: కర్ణుడికి అర్జునుడు; దుర్యోధనుడికి భీముడు; శల్యుడికి ధృష్టకేతుడు; కృపుడికి ఉత్తమౌజుడు; అశ్వత్థామకు నకులుడు కృతవర్మకు శైబ్యుడు; సైంధవుడికి యుయుధానుడు; భీష్ముడికి శిఖండి; శకునికి సహదేవుడు; వృషసేనుడికి అభిమన్యుడు; త్రిగర్తులకు ఉపపాండవులు; ద్రోణుడికి తాను (ధృష్టద్యుమ్నుడు).

ఇలా కౌరవసేనలోగల యోధులందరికీ తన సేనలోని ప్రతియోధులను నిర్ణయించి, ధృష్టద్యుమ్నుడు పాండవసేనలను వ్యూహంగా తీర్చాడు. అతని ఉద్దేశంలో అభిమన్యుడు అర్జునుడి కన్న యుద్ధంలో ప్రతాపశాలి!

అవతల కౌరవసేనకు నాయకుడైన భీష్ముడు దుర్యోధనుడు కోరిన మీదట, రెండు పక్షాలలో గల మహావీరుల తరతమ భేదాలను ఈ విధంగా తెలిపాడు.

కౌరవసేనలో కృతవర్మా, శల్యుడూ, సైంధవుడూ, కృపుడూ, అశ్వత్థామా, ద్రోణుడూ, బాహ్లికుడూ మొదలైనవారు అతిరథులు, ఉత్తమ వీరులు. అశ్వత్థామకు ప్రాణాల మీది ఆశ అనే లోపం ఉన్నది; లేకపోతే అతనితో సమానుడైన వీరుడు రెండు సేనలలోనూ లేడు. వృషసేనుడూ, అలంబుసుడనే రాక్షసుడూ మహారథులు. సుదక్షిణుడూ, నీలుడూ, శకునీ, విందాను విందులూ మొదలైనవారు ఏకరథులు. కవచకుండలాలు పోవటం చేతా, శాపగ్రస్తుడు కావడం చేతా కర్ణుణ్ణి రథుల జాబితాలో చేర్చటానికే లేదు; అతను అర్ధరథుడు.

పాండవసేనలో, అయిదుగురు పాండవులూ అతిరథులు. వారిలో అర్జునుడు ఉభయ సేనలలోకీ సాటిలేని యోధుడు; అతన్ని ఎదిరించి పోరాడే శక్తి గల భీష్మ ద్రోణులిద్దరూ వయోవృద్ధులే. అభిమన్యుడూ, సాత్యకీ, ఉత్తమౌజుడూ, యుధామన్యుడూ, శిఖండీ, ధృష్టద్యుమ్నుడూ, అతని తమ్ముడు సత్యజిత్తూ, ఘటోత్కచుడూ అతిరథుల కిందికే వస్తారు. ఉపపాండవులు అయిదుగురినీ మహారథులనవచ్చు. అలాగే, విరాటుడూ, ద్రుపదుడూ, శిశుపాలుడి కొడుకైన ధృష్టకేతుడూ మొదలైనవారు కూడా మహారథులే!





# కథలురానివాడు

ఒక ఊళ్ళో బొమ్మలు చేసేవాడుండేవాడు. అతని పేరు రామయ్య. దసరా ఇంకా రెండుమాసాలున్నదనగా అతను బొమ్మలు తయారుచేసి, వాటికి చక్కని రంగులు వేసి, ఒక గంపలో పెట్టుకుని, దారిలో ఉండే గ్రామాలలో వాటిని అమ్ముకుంటూ, దసరా పండగకు ముందుగానే బస్తీ చేరుకుని, అక్కడ మిగిలినవన్నీ అమ్మేసి, డబ్బుతో ఇల్లు చేరుకునేవాడు.

ఒకసారి రామయ్య గ్రామాల మీదుగా బస్తీకి వెళుతుండగా, ఊరూ వాడా లేని చోట పొద్దుగూకింది. అతను ఆ చీకటి లోనే నడుచుకుంటూ పోయి, దూరాన దీపపు కాంతి చూశాడు. అతనికి ప్రాణం లేచివచ్చినట్టయింది.

ఆ దీపం ఒక ఇంట్లో వెలుగుతున్నది. రామయ్య ఇంటిని సమీపించి చూస్తే, అందులో ఒకే ఒక ముసలివాడున్నాడు. రామయ్య ఆ ముసలివాడితో, "తాతగారూ, చాలా దూరం నుంచి వస్తున్నాను. మధ్య దారిలో చీకటి పడింది. తెల్లవారిన దాకా మీ ఇంట్లో నడుమువాల్చనిస్తారా?" అని అడిగాడు.

"దానికేం భాగ్యం? ఆ గంప ఆ మూల పెట్టి, ఇలా వచ్చి కూర్చో. కబుర్లు చెబుతుంటే నాకు కూడా కాలక్షేపం అవుతుంది. వంట ప్రారంభించబోతున్నాను. ఇద్దరమూ భోజనం చేద్దాం," అన్నాడు తాత.

రామయ్యకు పరమానందమయింది. తాత మంచివాడుగా కనిపించాడు. అతనికి ఏచెట్టుకిందనో బురదలో పడుకునే అవస్థ తప్పింది. అంతేకాక తాతధర్మమా అంటూ భోజనం కూడా దొరుకుతున్నది.

తాత వంటింట్లోకి వెళ్ళి అంతలోనే తిరిగి వచ్చి, "వంట ప్రారంభించాను. క్షణంలో అయిపోతుంది. ఏదన్నా పదం పాడు

విందాం," అన్నాడు, రామయ్య కెదురుగా కూర్చుని.

"నాకు పదాలూ, పాటలూ రావండి," అన్నాడు రామయ్య.

"పదాలూ, పాటలూ రాకపోవటమే మిటి? పోనీ ఏదన్నా కథ చెప్పు," అన్నాడు తాత.

"కథలు కూడా రావండి," అన్నాడు రామయ్య, తాత కోరిక తీర్చలేక పోయినం దుకు నొచ్చుకుంటూ.

తాత ఉగ్రుడైపోయి, "పాటలూ రాక, కథలూరాకపోతే నిన్నీ ఇంట ఒక్కక్షణం ఉండనీయను. పో బయటికి," అన్నాడు.

రామయ్య బిత్తరపోయాడు. ముసలివాడి ప్రవర్తన చాలా అసంగతంగా కనిపిం చింది. చేసేది లేక, నింపాదిగా లేచి, తన గుడ్డ తీసుకుని బయటికి నడిచాడతను. తాత తనను వెనక్కు పిలుస్తాడేమో నను కున్నాడు రామయ్య ఆశకొద్దీ; కాని అలాంటి దేమీ జరగలేదు.

రామయ్యకు ముందుకు పోబుద్ధి పుట్ట లేదు. ఏరాత్రి అయినా సరే, తానుదాటి వచ్చిన గ్రామానికే తిరిగి వెళ్ళి, ఎవరి పంచనో తలదాచుకుందామనిపించింది. అందు చేత అతను గంపనెత్తిన పెట్టుకొని




వెనక్కు నడవ సాగాడు. అతను కొంచెం దూరం వెళ్ళేసరి కల్లా, దారిపక్కన ఎవడో పొయ్యి అమర్చి, దాని మీద కుండలో ఏదోవండు తున్నాడు. చీకట్లో ఆ మనిషి ఆకారం స్పష్టంగా కనబడటం లేదు.

"నువ్వేనా,రామయ్యా. కాస్త ఈ కుండను ఈ తెడ్డుతో కలియబెట్టుతూ ఉండు. ఇప్పుడే వస్తాను," అన్నాడా మనిషి.

ఆ మనిషి ఎవరో, అతను తనను ఎలాగుర్తించాడో రామయ్యకు తెలీదు. ఆ



రాజు తన రాజ్యంలో మాత్రమే గౌరవించబడతాడు. పండితుడు ఏరాజ్యంలో అయినా గౌరవించబడతాడు. కాబట్టి రాజును పండితుడితో పోల్చలేము. — చాణక్యుడు

మనిషి తన చేతికిచ్చిన తెడ్డు తీసుకుని, కుండలో ఉడికే వంటకాన్ని రామయ్య కలియబెట్టసాగాడు. అదేం వంటకమో గాని కుండనిండా ఉన్నది. తినేటందుకు ఆ మనిషి తప్ప మరొకడు ఉన్నట్టు లేదు. తనకు కూడా ఇంత తిండి దొరుకుతుం దని ఆశపడ్డాడు రామయ్య.

తెడ్డు తన చేతికిచ్చి చీకటిలో ఎటో వెళ్ళిపోయిన మనిషి ఎంతకూ రాలేదు. "ఏమయ్యోయ్!" అని రామయ్య కేక పెడితే జవాబు లేదు.

"ఏయ్? ఏమిటలా దిక్కులు చూస్తావు? కలపవేం?" అని పొయ్యి మీది కుండ కేక పెట్టింది.

రామయ్య దద్దరిల్లి తెడ్డు కాస్తా కింద పడేసి, చివాల్న లేచి నిలబడ్డాడు. అతను దయ్యాలవాత పడ్డట్టయి హడలి పోయాడు.

"అంత పొగరా?" అంటూ తెడ్డు నేల మీది నుంచి తక్కున లేచి, రామయ్య నెత్తిన బలంగా కొట్టింది.

రామయ్యకు పై ప్రాణాలు పైనే పోయి నట్టయింది. భయమూ, గాభరా ముంచు కొచ్చి రామయ్య, తన బొమ్మల గంపసంగతి కూడా మరిచిపోయి, కాలిసత్తువకొద్దీ పరిగెత్తసాగాడు. తెడ్డు అతన్ని వెంటా డుతూ వీపు మీద బాదుతూనే ఉన్నది.

అదృష్టవశాన రామయ్యకు, బార్లా తెరిచి ఉన్న ఒక ఇంటివాకిలి దారిపక్కన కనబడింది అతను లోపలికి దూరి తలుపు వేసి, వెనక్కు తిరిగాడు.

అది ఆ ముసలివాడున్న ఇల్లే.

"ఏమిటయింది? అంత కంగారుగా వచ్చావు!" అన్నాడు తాత.

రామయ్య జరిగిన దంతా ముసలి వాడికి చెప్పేశాడు.

తాత అంతా విని, పరమానందం చెందినట్టు కనబడుతూ, "భలేవాడివే! ఆ పాటి కథ ముందే చెప్పి ఉంటే, నిన్ను బయటికి పొమ్మనే అనకపోదును గదా! వంట అయింది భోజనం చేతాంలే!" అన్నాడు.





# అధ్యాపకుడి అరణి

గోపి సెట్టిపాలెం అనేగ్రామంలోని జనార్ధన స్వామి ఆలయంలో, విష్ణుసంబంధమైన వేదమంత్రాలను, అధ్యాపకుడు అనే ఆయన చదువుతూండేవాడు. అంతేకాక, స్వామివారి నివేదనకు తయారు చేయ వలసిన పదార్థాలకు అవసరం అయిన నిప్పును, ఆయనే స్వయంగా వంటశాల లోని పొయ్యిలో వెలిగించేవాడు. ఇందు కోసం ఆయన పాత అరణికి బదులు, కొత్తగా జమ్మికొయ్యనూ, దానిమీద రాపా డించి నిప్పుపుట్టించేందుకు కొత్త జమ్మి పుల్లనూ తయారుచేయించాడు.

అధ్యాపకుడి దగ్గర, నా అనే వాళ్ళు లేని చిన్నా అనే పన్నెండేళ్ళకుర్రాడు వుండే వాడు. వాడు అధ్యాపకుడి అవసరాలు కనిపెడుతూ, తీరికవేళల్లో ఆయనవద్ద వేదమంత్రాలు నేర్చుకునేవాడు. ఒకసారి అధ్యాపకుడికి అనారోగ్యం చేసింది. చూడ డానికి వైద్యుడు వచ్చాడు.

వైద్యుడు, అధ్యాపకుణ్ణి పరీక్షించి, "పెద్దగా కంగారుపడవలసిందేమీ లేదు. రెండు రోజులపాటు విశ్రాంతి తీసుకోండి. తలమీద మాత్రం స్నానం చేయకండి!" అని హెచ్చరించి, "వెళ్ళివస్తాను," అన్నాడు.

ఇందుకు అధ్యాపకుడునవ్వి, "వైద్యుడు, అప్పులవాడు వెళ్ళివస్తాం అనకూడదు. వెళ్ళిపోతాం, అనాలి!" అన్నాడు.

వైద్యుడుకూడానవ్వి, "అందరికీ శకునం చెప్పేబల్లి కుడితిలో పడిందిట! ఊరందరి ఆరోగ్యాలు రక్షించేవాడు ఆ జనార్ధన స్వామి. ఆయనకు అన్నివేళలా పూజలు చేసే మీకోసం, జనార్ధనస్వామిని గుళ్ళోంచి రప్పించుకోండి. అప్పుడు నాకు వెళ్ళివస్తాను అనిచెప్పే అవసరం రాదు," అన్నాడు.

అధ్యాపకుడు ఆ మాటలకు నొచ్చు కుని, "నీ వెటకారం అర్థమైంది, నాయనా! సర్వాంతర్యామి అయినదేవుడు గుళ్ళోనే వున్నాడని భావిస్తే—అదిపొరబాటు. అంతటా దేవుడున్నాడని భావించే మనం, ఒక ప్రదేశం ఎన్నుకుని పాపపుణ్యాలు లెక్క చెప్పడానికి, ఒక ఆకారం తయారుచేసి మనశ్శాంతి పొందుతాం," అని ఆగాడు.

జె. ఉదయనాగ శిరీష



వైద్యుడు చెప్పండి అన్నట్టు తలఊపి మౌనంగా వూరుకున్నాడు.

అధ్యాపకుడు ఒక క్షణం ఆగి, "నాయనా! మనుషులు సాటి మనుషులతో కలిసి జీవించడానికి అడవులకు దూరంగా వచ్చేశారు. తమ నివాసప్రాంతాల కొంత చోటును దేవుడికి కేటాయించి, అక్కడ గుళ్ళు కట్టారు. నమ్మితే ఆయన ప్రతి మనిషిలోనూ కనిపిస్తాడు. ఆ జనార్దనస్వామే నీ రూపంలోవచ్చి, నాకు వైద్యం చేస్తున్నాడని నేను భావిస్తాను," అన్నాడు.

వైద్యుడు అదోలా నవ్వి, "మీ వేదాంతం వినడానికి బాగుంది. కాని అది వైద్యుడిగా నాకు, మీకు పెట్టినట్టు బువ్వ పెట్టదు. సరే, వెళ్ళిపోతానులెండి!" అని విసురుగా లేచి మెట్లుదిగబోతూజారిపడి, పక్కన వున్న స్తంభానికి తల గుద్దుకోవడంతో స్పృహతప్పి పడిపోయాడు. అప్పుడు అధ్యాపకుడు, చిన్నాసాయంతో వైద్యుడికి సపర్యలు చేసి స్పృహతెప్పించాడు.

కొంచెం తేరుకున్నాక వైద్యుడు వినయంగా, "స్వామీ! ఈ సృష్టిలో ప్రతి కార్యానికీ కారణం వుంటుందంటారు. స్పృహ తప్పిపోయిన నాకు నేనే వైద్యం చేసుకోలేని విద్య పనికిరానిదని అనలేంకదా! అతీతమైన శక్తికి నమ్మకంతో మేముచేసే పూజాపునస్కారాలకు, భగవంతుడు సృష్టించు కున్న వ్యక్తి మీరు! క్షమించండి. మీది పనికిరాని వృత్తికాదు," అన్నాడు.

ఈ జరిగిన సంఘటనతో, అధ్యాపకుడికి విశేషప్రచారం వచ్చింది. గుడిలో అరణి మధించి నిప్పుపుట్టించడం, ఆయనకొక్కడికే సాధ్యమని, ఆయన్నెవరైనా అవమానిస్తే జనార్దనస్వామి ఆగ్రహిస్తాడనీ జనం చెప్పుకోవడంతో, అధ్యాపకుడిలో, తాను మహాపవిత్రుడననే అహంకారం చోటు చేసుకున్నది.

ఇలా వుండగా-ఒకసారి పెద్ద గాలివాన వచ్చింది. జనార్దనస్వామి దేవాలయపు ధ్వజస్తంభంపడిపోయింది. ఊళ్ళో అందరూ చందాలు వేసుకుని, ధ్వజస్తంభం పునఃప్రతిష్ఠచేయడానికి ముహూర్తం పెట్టించారు. ముహూర్తం పదిరోజులలో వుందనగా, పొరుగూళ్ళోవుంటున్న అధ్యాపకుడి దూరపు బంధువొకామె కాలం చేసింది. అధ్యాపకుడు, తనదగ్గర శిష్యరికం చేస్తున్న చిన్నాను వెంటబెట్టుకుని, ఆ ఊరువెళ్ళాడు.

ఆయన బంధువురాలికి ఎవరూ లేరు. అందుచేత దహన సంస్కారాలు చేసే

బాధ్యత, అధ్యాపకుడి మీదపడింది. మామూలు సమయంలో అయితే, అధ్యాపకుడు ఆ బాధ్యత తీసుకునేవాడే. కాని, ఇప్పుడామెకు దహన సంస్కారాలు చేసి కర్మకాండ స్వీకరిస్తే, ధ్వజస్తంభం ప్రతిష్ఠాపన ముహూర్తానికి, అరణి చేసే అర్హత కోల్పోతాడు. అందుచేత, ఆయన ఆ కార్యక్రమాన్నంతా చిన్నాచేత చేయించి గోపి సెట్టిపాలెంకు తిరిగి వచ్చాడు.

చిన్నా, అధ్యాపకుడి బంధువురాలికి కర్మకాండలన్నీ శ్రద్ధగా జరిపి, తనూ పదకొండవ రోజున గోపి సెట్టిపాలెంకు వచ్చాడు.

ఆ రోజు అర్ధరాత్రి ధ్వజస్తంభం ప్రతిష్ఠాపన ముహూర్తం. ఊరంతా కోలాహలంగా వుంది. ఋత్విజులు హోమకుండం తయారు చేశారు. ఇక దానిలో అరణి మథించి అగ్నిహోత్రుడిని మంత్రపూర్వకంగా ప్రవేశపెట్టాలి.

అధ్యాపకుడు అరణి తీసుకుని, ఏదో పూనకం వచ్చినవాడిలా ఊగిపోతూ, "ఈ దేవాలయాన్ని త్రేతాయుగంలో, నారదుడు ప్రతిష్ఠించాడని స్థలపురాణం చెబుతున్నది. అదుగో, మహతి తంత్రులు మీటుతూ ఆయన ఈ ముహూర్తానికి వేంచేస్తున్నాడు. నేను అగ్నిని ఆహ్వానించగానే, ఋత్విజుల మంత్రోచ్చారణతో దేవతలు కూడా వస్తారు!" అంటూ అరణిని మథించసాగాడు.

అధ్యాపకుడి మాటలు విన్న, అక్కడ చేరిన ప్రజలు అతడు చూపిన దిక్కుకేసి తలలెత్తి, "నారద భగవానుడికీ, జై!" అంటూ నినాదాలు చేశారు.

రోజూ అవలీలగా నిప్పును తయారు



చేయగలిగిన అధ్యాపకుడు, ఇప్పుడు ఎంత మథించినా అరణిలో నిప్పురాజుకోలేదు. ఆయాసపడుతూ ఆయన తల వంచుకుని పక్కకు తప్పుకున్నాడు.

అక్కడవున్న వేదపండితులు, తామూ ప్రయత్నించారు. ఫలితం కలగలేదు. చివరకు, ఊళ్ళోఅందరిచేతా పుణ్యాత్ములుగా పిలవబడే వారిని ప్రయత్నించి చూడమన్నారు. వాళ్ళూ ఎంతప్రయత్నించీ అరణిలో నిప్పును పుట్టించలేకపోయారు.

అప్పుడు చిన్నా ముందుకు వచ్చి, అధ్యాపకుణ్ణి, "గురువుగారూ! నేను ప్రయత్నించేదా?" అని అడిగాడు.

"నువ్వు, చనిపోయిన నా బంధువుకు కర్మకాండలు జరిపావు. నీకు ఏటిసూక్తం! ఒక ఏడాదివరకు, నువ్వు దైవకార్యాలకు అనర్హుడివి," అన్నాడు అధ్యాపకుడు.

ఆ మాట వింటూనే పండితులలో ఒకాయన, "అయ్యా! మీరు చేయవలసిన కార్యాన్ని, మీకు బదులు చిన్నా చేశాడు. ఇది, మీరు లేదా అర్చకుడు దేవాలయంలో, ఇతరులు చేయవలసిన పూజను, వారి గోత్రనామాలతో చేసి పుణ్యఫలాన్ని రప్పించడంలాటిది! అలాగే, చిన్నా చేసినప్పటికీ, ఆ కర్మకాండ మీరుచేసినట్టే అవుతుంది. చిన్నాను ప్రయత్నించమనడంలో దోషం లేదు," అన్నాడు.

అధ్యాపకుడు ఎంతో దిగులుగా, "మానవ సేవే మాధవ సేవ అన్న సత్యాన్ని మరిచిపోయాను. అనాథప్రేతసంస్కారం కోటి యజ్ఞఫలమిస్తుంది. చిన్నా నిజంగా ధన్యుడు. నేను కర్తవ్యాన్ని విస్మరించాను. నేను తప్పమరెవరూ అరణి మధించలేరని గర్వపడ్డాను. భగవంతుడు, నా కళ్ళుతెరిపించాడు. చిన్నాకు ఏటిసూక్తం లేదు. దాన్ని నేను స్వీకరిస్తు న్నాను! చిన్నాను ప్రయత్నించమనండి," అన్నాడు.

చిన్నా, అధ్యాపకుడికి నమస్కరించి, అరణిమధిస్తూ, "అప్పుడూ, ఇప్పుడూ కూడా నేను గురువాజ్ఞనే పాటిస్తున్నాను. గురువు దేవుడితో సమానుడు. ఆ మాట నిజమైతే నిప్పుపుట్టాలి!" అన సాగాడు.

వాడలా అంటూండగానే నిప్పుపుట్టింది. పండితులు, సమిధలు వెలిగించారు. ఆ తర్వాత ధ్వజస్తంభం ప్రతిష్ఠించడం జరిగింది.

మర్నాడు గుడి వంటశాలలో పొయ్యి రాజెయ్యడానికి, అధ్యాపకుడు చిన్నాను పిలిచాడు. వాడు, అధ్యాపకుడితో వినయంగా, "గురువర్యా! మీ స్థానం ఆక్రమించే ఉద్దేశం, నాకు లేదు. అర్హతలు కలిగిన మీ సేవలు దేవుడికి అవసరం. అనాథప్రేతసంస్కారం వల్ల, కోటియజ్ఞ ఫలితం కలుగుతుందన్నమాట నిజం చెయ్యడానికి, భగవంతుడు నాకు అవకాశం యిచ్చాడు, అంతే!" అన్నాడు.

విచిత్రంగా అధ్యాపకుడు, ఈ సారి అరణిలో నిప్పును అవలీలగా చేయగలిగాడు. ఆయనలో గర్వాహంకారాలు మటుమాయమయినై. కొన్నేళ్ళతర్వాత చిన్నా, అధ్యాపకుడి స్థానంలో నియమితుడై గొప్ప పేరుప్రతిష్ఠలు గడించాడు.



# మనస్సుకు అంటే మురికి!

ఒక చిట్టడవి దాపునగల గ్రామం నుంచి, తండ్రీ-కొడుకులు పొరుగూరిలో జరగనున్న బంధువుల ఇంటి పెళ్ళికి బయలుదేరారు. వాళ్ళు, అడవిదారిన కొంత దూరం వెళ్ళాక, బురదగుంటలో చిక్కుకున్న మేకపిల్ల ఒకటి కనిపించింది. అది గట్టుపైకి చేరలేక, 'మే...మే!' అంటూ అతిదీనంగా అరవసాగింది.

మేకపిల్ల అవస్థను గమనించిన తండ్రి, పంచెను మోకాళ్ళమీదికి మడిచికట్టి, బురదగుంటలో దిగి, మేకపిల్లను రెండు చేతులతో పైకెత్తి పట్టుకుని, గట్టుమీదికి చేర్చాడు. మేకపిల్ల గట్టుమీదికి చేరుతూనే, ఒళ్ళంతా ఒకసారి విదిలించుకుని, ఛెంగున గంతులేస్తూ, చెట్ల గుంపుల్లోకి పరిగెత్తింది. అయితే, అది విదిలించిన బురద పడి, తండ్రిబట్టలన్నీ మురికి అయిపోయినై.

ఇది చూసి కొడుకు, "నాన్నా, అనవసరంగా మేకపిల్లజోలికి పోయి, కొత్తబట్టలన్నీ మురికి చేసుకున్నావు! ఈ బట్టలతోనా, పెళ్ళివారింటికి పోవడం," అన్నాడు విచారంగా.

ఇందుకు తండ్రి చిన్నగా నవ్వి, "బాబూ, బట్టలకు అంటిన మురికిని సులభంగా వదిలించుకోవచ్చు కాని, ఒక సహాయం చెయ్యగలిగివుండి కూడా, అది చెయ్యకపోయినప్పుడు, మనస్సుకు పట్టే మురికిని వదిలించుకోవడం సాధ్యపడుతుందా!" అన్నాడు.

—జి.సి.జీవి



# కనుగొనండి, రాయండి,

ఈ సంచికలో ప్రచురించిన ప్రశ్నలకు సమాధానాలు వచ్చే సంచికలో ప్రకటించబడతాయి. అదేసమయంలో మీరు కూడా భారతదర్శనం పోటీకి సమాధానాలు పంపవచ్చు. అయితే, ఎంట్రీలు పంపడానికి మీరు కొంత సృజనాత్మక కృషి చేయాలి. గత సంచికలోని కథలను క్షుణ్ణంగా చదవండి. ఆ కథలలో మీకు బాగా నచ్చిన కథను తెలియజేస్తూ ఆ కథ ఎందుకు మీకు నచ్చింది? అన్న దానిని వివరిస్తూ ఇరవై వాక్యాలకు మించకుండా చిన్న వ్యాసం రాసి, మీ సమాధానాలకు జతచేయాలి. మీ వయస్సు, విద్యార్థి(ని) అయినట్టయితే మీరు చదువుతూన్న తరగతి/విద్యాసంస్థ పేరు; మీ పూర్తి చిరునామా రాసి, సమాధానాల చివర మీరు సంతకం చేయాలి. మీ సంతకాన్ని ధృవపరుస్తూ, మీ ఉపాధ్యాయులు లేదా మీ తల్లితండ్రులలో ఎవరో ఒకరు, సంతకం చేయాలి. సమాధానాలను **భారతదర్శనం పాఠకులకు పోటీ, చందమామ బిల్డింగ్స్, వడపళని, చెన్నయ్-600 026** చిరునామాకు పంపాలి.

మొదటి బహుమతి రూ. **1000**/-
రెండవ బహుమతి రూ. **500**/-
ఇంకా ఐదు ప్రోత్సాహక బహుమతులు ఒక్కొక్కటి రూ. **200**/-







**భారతదర్శనం పాఠకులకు పోటీ**

అదొక చీకటి రాత్రి. నగర వీధులన్నీ నిర్మానుష్యంగా ఉన్నాయి. పవిత్ర నదీతీరంలోని శ్మశానంలో కొన్ని చితులు మండుతున్నాయి. ఒక స్త్రీ, చనిపోయిన తన బిడ్డ శవాన్ని హృదయానికి హత్తుకుని దీనంగా విలపిస్తూ, ఒంటరిగా శ్మశానానికి వచ్చింది. బిడ్డ శవదహనానికి ఆమె సుంకం చెల్లించాలి. అక్కడున్న కాటికాపరి తన యజమాని కోసం సుంకం వసూలు చేయాలి. అయితే, ఆమె దగ్గర డబ్బులేదు. సుంకం చెల్లించకుండా శవదహనానికి అతడు ఒప్పుకోలేదు. వచ్చిన స్త్రీ ని పరిశీలనగా చూసి, ఆమె తన భార్య అనీ, చనిపోయిన బిడ్డ తన బిడ్డ అనీ ఆ కాటికాపరి గుర్తించాడు!

ఈ పురాణ కథలోని కాటికాపరి ఎవరు? ఆ స్త్రీ ఎవరు? ఆ శ్మశానవాటిక ఎక్కడ ఉండేది?

కింద కనబరచిన పౌరాణిక పాత్రలకూ, ప్రదేశాలకూ మధ్య వున్న పరస్పర సంబంధం ఏమిటో మీకు తెలుసా?




విజ్ఞాన వినోదాల మేలు కలయిక,

# బహుమతులు గెలుచుకోండి!



1. సముద్రతీర నగరం పూంపుహార్‌ను వర్ణించే ప్రాచీన గ్రంథం ఏది?
2. అతి ప్రాచీన కాలంలో భారత దేశమంతటా తిరిగి కథలు సేకరించాడని చెప్పబడే గ్రంథకర్త ఎవరు?
3. సావిత్రి సత్యవంతుల కథ ఏ ప్రాచీన గ్రంథంలో చోటు చేసుకున్నది?
4. తమిళ, హిందీ భాషలలో రామాయణగాథకు ప్రాచుర్యం గలిగించిన ఇద్దరు మహాకవులు ఎవరు?
5. సుప్రసిద్ధ నాస్తికవాది అయిన ప్రాచీన భారతీయ తత్వవేత్త ఎవరు?







నిబంధనలు :

1. చందమామ ఇండియా లిమిటెడ్ సంస్థలో ఉద్యోగం చేసే వాళ్ళూ/సంబంధించిన వాళ్ళూ, వాళ్ళ బంధువులూ ఈ పోటీలో పాల్గొనకూడదు.
2. న్యాయనిర్ణేతలదే తుది నిర్ణయం. ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలు జరుపబడవు.
3. దస్తూరీ స్పష్టంగా లేని ఎంట్రీలు స్వీకరించబడవు.
4. పోటీ ఫలితాలు చందమామ జూలై నెల సంచికలో ప్రకటించబడతాయి.
5. సమాధానాలు ఏప్రిల్ 30వ తేదీలోగా మాకు చేరాలి.

| | | |
|---|---|---|
| ఎ. కృష్ణుడు | - | విదర్భ |
| బి. బలభద్రుడు | - | కుశస్థలి |
| సి. నలుడు | - | నిషధ |
| డి. మార్కండేయుడు | - | పుష్పభద్ర తీర్థం |
| ఇ. గుహుడు | - | శృంగివేరపురం |

...దేశ భాషలలో చందమామ ప్రత్యేకత!



# భారతదేశం

నాడు-నేడు

# కలకత్తా

## (బ్రిటిష్ ఇండియా తొలిరాజధాని)




కలకత్తా నగరమా? కోల్‌కటానగరమా? కలకత్తా పేరును కోల్‌కటాగా మార్చాలని ఇటీవలే నిర్ణయించారు. అయితే, అలా మార్చడం వల్ల ఉచ్చారణలో కొద్దిగా తేడా కనిపిస్తుందేతప్ప, అర్థంలో ఎలాంటి మార్పూ రాదు. అసలు ఆ పదానికి అర్థం ఏమిటో నిగూఢంగానే ఉంటున్నది.

భారతదేశానికి వ్యాపార నిమిత్తం వచ్చిన ఈస్ట్‌ఇండియాకంపెనీ ఇంగ్లీష్‌వ్యాపారులకు 1698 నవంబర్ 9 వ తేదీ సబర్నారాయ్ చౌధురి కాళీఘట్, సుతానతి, గోవిందపూర్ అనే మూడు గ్రామాలను విక్రయించాడు. ఈస్ట్‌ఇండియాకంపెనీ తరపున వాటిని కొన్న వ్యక్తి జాబ్‌చార్నాక్. వీటితో కొన్నిచుట్టుపక్కల గ్రామాలు కలిసి కలకత్తా ఏర్పడింది. చార్నాక్ కొన్న తొలి మూడు గ్రామాలలో కాళీఘట్ ముఖ్యమైనది. అక్కడే సుప్రసిద్ధమైన కాళీ మాత ఆలయం ఉన్నది. దాని పేరు మీదు గానే దీనికి కలకత్తా అన్న పేరు ఏర్పడి వుండ వచ్చు.

జాబ్ చార్నాక్‌ను ఈ నగర స్థాపకుడుగా భావిస్తారు. చనిపోయిన భర్త చితిమీద సహగమనం చేయడానికి పూనుకున్న ఒక స్త్రీని కాపాడి తనవెంట తీసుకువెళ్ళి, ఆమెనే పెళ్ళాడాడు చార్నాక్. ఆయన సమాధి ఇప్పటికీ నగరంలో ఉన్నది.

హుగ్లీనది పేరుతో ప్రవహించే గంగానదీ తీరంలోని కలకత్తా త్వరిత గతితో అభివృద్ధి సాధించింది. "అవకాశం నిర్దేశించి అనుకో కుండా వెలసిన నగరం,"అని రుడ్యార్డ్ కిప్లింగ్ ఈ నగరాన్ని వర్ణించాడు.

ఈస్ట్ ఇండియా కంపెనీ కోటను నిర్మించడం మొదలుపెట్టి 1716 సం॥ నాటికి పూర్తి చేసింది. మరు సంవత్సరమే, ఈ కోట కేంద్రంగా కంపెనీ తన వర్తకవ్యాపారాలను సాగించడానికి మొగల్ చక్రవర్తి నుంచి హక్కును పొందింది. ఇక్కడి కోట-విలియం కోటగా ప్రసిద్ధిగాంచింది.

అయినా, వ్యాపారులకు కోట అవసరం ఏమిటి? పాలకులకే కదా కోటలు కావాలి!

క్రమంగా, వ్యాపారుల కంపెనీ-జమీందారీలను కొనడం; కొత్త ప్రాంతాలను జయించడం; సొంత సైన్యాలను సమకూర్చుకోవడం మొదలుపెట్టింది!

బెంగాల్ నవాబు సిరాజ్ ఉద్దౌలాకూ, కంపెనీకీ మధ్య తీవ్రఘర్షణ మొదలయింది. 1756వ సం॥లో నవాబు, కంపెనీ సైన్యాన్ని ఓడించి కలకత్తాను వశపరచుకున్నాడు. అయితే, మరు సంవత్సరమే క్లైవ్ నాయకత్వంలో, కంపెనీ సైన్యం మళ్ళీ కలకత్తాను జయించింది. రెండు సేనలూ మళ్ళీ ప్లాసీ వద్ద భీకరయుద్ధం చేశాయి. సిరాజ్ ఉద్దౌలా ఓడిపోయాడు. ఆ తరవాత హతమార్చబడ్డాడు. 1772వ సం॥ నాటికి ఈస్ట్ ఇండియా కంపెనీ చాలా పరగణాలను వశపరచుకుని వాటికి గవర్నర్ జనరల్‌ను నియమించవలసిన పరిస్థితి ఏర్పడింది. వారెన్ హేస్టింగ్స్ 1772 వ సం॥లో మొట్టమొదట ఈ పదవిని చేపట్టాడు. ఆయన విలియం కోటనుంచి తన పాలనాధికారాన్ని సాగించాడు. కంపెనీ మనదేశంలోని ఇతర ప్రాంతాలను ఆక్రమించిన తరవాత కూడా కలకత్తా నగరమే బ్రిటిష్ ఇండియాకు రాజధానిగా కొనసాగింది. 1912వ సం॥లోనే రాజధానిని అక్కడినుంచి ఢిల్లీకి మార్చారు.

ప్రస్తుతం కలకత్తా పశ్చిమ బెంగాల్ రాష్ట్ర రాజధానిగా కొనసాగుతున్నది.

పాత కలకత్తాలో చాలా ప్రసిద్ధి చెందిన ఆలయం కాళీఘట్. ఈ ప్రాంతం అడవిగా ఉన్నప్పుడు కూడా అక్కడి దేవతను కొలిచేవారు. పరేష్ నాథ్ ఆలయమనే అందమైన జైన దేవాలయమూ, మదన్ మోహన్ ఆలయమూ, శతాబ్దాలనాటి అర్మినియన్ చర్చ్, సెయింట్ పాల్స్ కెథడ్రల్ ప్రసిద్ధమైనవి. సహీద్ మినార్, విక్టోరియా మెమోరియల్ మ్యూజియం మొదలైన భవనాలు పర్యాటకులను విశేషంగా ఆకర్షిస్తాయి. రవీంద్రనాథ్ టాగూర్ జన్మస్థలం,వివిధవిశ్వవిద్యాలయాలు, కళాసాంస్కృతిక కేంద్రాలు ఉన్నాయి. ఈనాడు మనదేశంలో విద్యుత్ ట్రాములు నడిచే ఒకే ఒక్కనగరం కలకత్తా. మనదేశంలో ప్రప్రథమంగా 1962వ సం॥లో ఇక్కడ 'ప్లేనటోరియం' ఏర్పాటు చేయబడింది. 1997వ సం॥లో మొట్టమొదటి 'సైన్స్ సిటీ' రూపొందింది.

ప్రధాన నగరం వున్న కలకత్తా జిల్లా జనాభా 44లక్షలు. జంటనగరమైన హౌరా జనాభా 38 లక్షలకు పైగా వుంటుంది. 24 పరగణాల జిల్లాలోని కొంత భాగాన్ని కూడా కలకత్తాలో భాగంగానే భావిస్తారు!






# ప్రపంచ పుస్తక ప్రదర్శన

ఆధునిక ప్రపంచంలో అనుకోని సంఘటనలు అనేకం జరుగుతూఉంటాయి. ఒకచోట యుద్ధం; మరొక చోట సైనికాధికారి ఎదురు తిరగడంతో ప్రభుత్వం గల్లంతు; ఊచకోతలు, అపహరణలు-ఇలా రోజూ రకరకాల వార్తలు దర్శనమిస్తున్నాయి!

అయితే, మనసును కలతపరచే ఇలాంటి సంఘటనలకే ప్రపంచం పరిమితం కాదు. మరొక కోవకు చెందిన గొప్పవిశేషాలు కూడా జరుగుతూనే ఉన్నాయి. అవి మంచివి; సృజనాత్మకమైనవి. అవి అంతగా హడావుడీ లేకుండా ఎందరి జీవితాలనో ప్రభావితం చేసి మంచి మార్పులు తీసుకువస్తాయి!

ఫిబ్రవరి 5 నుంచి 13వ తేదీ వరకు న్యూఢిల్లీ ప్రగతి మైదాన్‌లో జరిగిన ప్రపంచ పుస్తక ప్రదర్శన ఆ కోవకు చెందినది. భారత ప్రధాని శ్రీ అటల్ బిహారీ వాజ్‌పాయ్ ఈ ప్రదర్శనను ప్రారంభించారు. మానవ వనరుల అభివృద్ధిశాఖామంత్రి మురళీమనోహర్ జోషీ ఉపన్యసించారు.

ఇది నూతన సహస్రాబ్దిలో జరిగిన మొట్ట మొదటి ప్రదర్శన; మన దేశంలో జరిగిన 14వ ప్రపంచ పుస్తక ప్రదర్శన. 1972వ సం॥లో మనదేశంలో ఏర్పాటుచేసిన ప్రప్రథమ ప్రపంచ పుస్తక ప్రదర్శనలో దేశ విదేశాలకు చెందిన 224 మంది ప్రచురణకర్తలు, పుస్తక విక్రేతలు పాల్గొన్నారు. ఇప్పుడు జరిగిన ప్రదర్శనలో 29,000 మీ॥ విస్తీర్ణంలో తొమ్మిది పెద్ద పెద్ద పెవిలియన్లలో 1,200 సంస్థలు పాల్గొన్నాయి!

మరో ముఖ్య విశేషం ఏమంటే, ఈ సంవత్సర పుస్తక ప్రదర్శన ప్రధాన అంశం—బాల సాహిత్యం! వివిధ దేశాలకు చెందిన బాల సాహిత్యంలోని ఉత్తమ గ్రంథాలను - అందుకని ప్రత్యేకంగాకేటాయించిన పెవిలియన్‌లో ఆకర్షణీయంగా అమర్చి,ప్రదర్శనకు ఉంచారు.






ఈ పుస్తకాల మధ్య వెళుతూ, వేలాది మంది పిల్లలు ఆనందానుభూతికి లోనయ్యారు. పుస్తకాల ద్వారా పిల్లలకు సమకూరే విజ్ఞాన వివేకాలనూ, ఆనందాన్నీ గురించి పెద్దలు గ్రహించారు.

ఈ సందర్భంగా ప్రదర్శనకు ఏర్పాటు చేసిన - కేవలం పిల్లల రచనలతో మాత్రమే నిండిన ప్రపంచంలోకెల్లా అతి పొడవైన (వార్తా) పత్రిక అందరిదృష్టినీ ఆకర్షించింది. మనదేశంలోని వివిధ రాష్ట్రాలకు చెందిన పిల్లలు రచించిన వ్యాసాలు, కవితలు, కథలు; చిత్రించిన చిత్రాలు – అందంగా పరచిన పొడవాటి ఈ కుడ్యపత్రికలో చోటు చేసుకున్నాయి.

జాతీయ పుస్తకసంస్థకు సంబంధించిన ఒక విభాగం అయిన జాతీయ బాలసాహిత్య కేంద్రం - బాలసాహిత్యానికి సంబంధించిన సమస్యలను విశ్లేషించడానికి ఒక సదస్సును ఏర్పాటు చేసింది. ఈ సదస్సులో పలువురు ప్రముఖ రచయితలు, సంపాదకులు, విద్యా వేత్తలు, చిత్రకారులు, దేశ విదేశాలకు చెందిన ప్రతినిధులు పాల్గొన్నారు. ఈ సదస్సు ప్రారంభోత్సవానికి సుప్రసిద్ధరచయితలు రస్కిన్‌బాండ్ ముఖ్యఅతిథి గానూ, మనోజ్ దాస్ ప్రధానవక్తగానూ పాల్గొన్నారు. ఈ ఇరువురూ కూడా మన పత్రిక 'సంపాదక సలహాదారులు' అన్న విషయం చెప్పుకోతగ్గ విశేషం!

మన పత్రిక కూడా ప్రదర్శనలో ఒక స్టాల్‌ను ఏర్పాటు చేసింది. పన్నెండు భాషలలో చందమామ; ప్రచురణారంగంలోనే అపూర్వమైన ఒక విశిష్ట ప్రయోగం! ప్రదర్శనకు వచ్చిన అసంఖ్యాకమైనఅభిమానులను అలరించింది.

సజీవంగా తిరగాడుతూన్న చింపాంజీ, డాగీ పాత్రలు చిన్న పిల్లలను ఎంతగానో మురిపించాయి.

ఇటీవలికాలంలో టెలివిజన్, ఇంటర్నెట్ లాంటి ఎలక్ట్రానిక్ మాధ్యమాలు ప్రజల చదివే సమయంలో ఎక్కువ భాగాన్ని ఆక్రమించినప్పటికీ - మనిషికి విజ్ఞాన వినోదాలు పంచడంలో పుస్తకాలు ఇంకా ప్రధాన పాత్ర వహిస్తూనే ఉన్నాయి. మనిషి స్వభావాన్ని అతని స్నేహితులను బట్టి గ్రహించవచ్చు అని చెప్పడం మనకందరికీ తెలిసిందే. ఒక అమెరికన్ రచయిత దానిని కొద్దిగా మార్చి, "ఒక మనిషి స్వభావాన్ని అతని మనసు చేసే సాంగత్యాన్ని బట్టి తెలుసుకోవచ్చు," అని చెప్పాడు.

మంచి పుస్తకాలే మన మనసులకు మంచి నేస్తాలుగా ఉండగలవు!





# ఫోటో వ్యాఖ్యల పోటీ

ఈ ఫోటోలకు ఒక్క మాటలోగాని, చిన్న వాక్యంలోగాని వ్యాఖ్యలు రాయగలరా? రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.



ఫోటో వ్యాఖ్యల పోటీ
చందమామ
వడపళని
చెన్నయ్-600 026





వ్యాఖ్యలను పోస్ట్‌కార్డుపైన రాసి ఈ నెల 25 వ తేదీలోగా మాకు అందేలా పంపాలి. పోటీ ఫలితాలు జూన్ 2000 సంచికలో ప్రచురిస్తాం. ఉత్తమమైన వ్యాఖ్యకు రూ.100 బహుమానం.

## అభినందనలు



ఫిబ్రవరి 2000 నెల సంచికలో బహుమతి పొందిన వ్యాఖ్యలు పంపినవారు:

ఆర్.మాధవి D/o. ఆర్.విశ్వేశ్వరరావు
3-31/A, బ్యాంక్ కాలనీ, ఏలూరు-534007



బహుమతి పొందిన వ్యాఖ్యలు
మొదటి ఫోటో : అడవంతా తిరిగేస్తా!
రెండవ ఫోటో : అందరినీ మురిపిస్తా!!

